18.11.1994 శుక్రవారం, 20 పేజీలు, సంపుటి : 66, సంచిక : 45, విడిప్రతి : రు. 2.00 లు ·

Phone : 27354. Regd No. HNL. 18

# జమీన్‌రైతు

స్థాపకుడు : నెల్లూరు వెంకట్రామానాయుడు
జీవప్రదాత : నెల్లూరు శ్రీరామమూర్తి



## ముఖ్యమంత్రి తిరుగుబాట్లు ప్రేరేపించడం చరిత్రలో లేదు!

# వందస్థానాల్లో కాంగ్రెస్‌కు తూట్లు!

రాష్ట్ర శాసనసభ ఎన్నికల్లో ఈమారు విచిత్రమైన పరిస్థితి నెలకొన్నది. ఎన్నికల రంగంలో తలపడుతున్న ప్రధాన పార్టీలు కాంగ్రెస్, తెలుగుదేశమైనా పోటీ ప్రధానంగా కాంగ్రెస్ పార్టీలోని వివిధ ముఠాల మధ్యనే కొనసాగుతోంది. రాష్ట్రంలో అధికార పీఠం భవితవ్యాన్ని నిర్ణయించే వందస్థానాల్లో కాంగ్రెస్ పార్టీ తిరుగుబాటు అభ్యర్థులు ఫలితాన్ని తారుమారు చేసే అవకాశముంది. తెలుగుదేశం పార్టీ బలహీనంగా వున్న



నియోజకవర్గాల్లో కాంగ్రెస్ వెన్నుపోట్లు తెలుగుదేశంకు వరప్రసాదం కానున్నాయి. శాసనసభకు మునుపు జరిగిన ఎన్నికల్లో ఇటువంటి పరిస్థితి ఎన్నడూ ఏర్పడలేదు. పార్టీకంటే ముఠాలే ముఖ్యమని తాపత్రయపడుతున్న కాంగ్రెస్ రాష్ట్రాధినేతల దుశ్చర్యలు కాంగ్రెస్ పార్టీని నిట్టనిలువునా ముంచబోతున్నాయి.

1983 లో మాదిరిగా రాష్ట్రాధికారాన్ని తెలుగుదేశం పార్టీకి ధారాదత్తం చేయడానికి, ముఖ్యమంత్రి చర్యలు దోహద పడుతున్నాయి. తన అభ్యర్థులకు టిక్కెట్లు రాని స్థానాల్లో సాక్షాత్తు ముఖ్యమంత్రే పోటీ అభ్యర్థుల్ని రంగంలోకి దించి కాంగ్రెస్ పార్టీని హతమార్చడంలో తనవంతు పాత్ర నిర్వహిస్తున్నారు. పార్టీ అభ్యర్థుల ఎంపికలో కేవలం అస్మదీయుల దృష్టితోనే ముఖ్యమంత్రి వ్యవహరించారు. రాష్ట్రంలో బలమైన ప్రతిపక్షాన్ని ఎదుర్కోవాల్సి వున్న విషయం తెలిసి కూడా, గెలుపు గుర్రాల్ని కాదని ముఖ్యమంత్రి తన వాళ్లకు టిక్కెట్లు ఇప్పించుకోవడంలో సఫలీకృతు డయ్యాడు. పార్టీలో తనకు గిట్టని వాళ్లను మట్టి కరిపించి అధిష్టాన దేవుడి దగ్గర తన పంతం నెగ్గించుకున్నానన్న సంతృప్తి తప్పితే కాంగి అధికార పీఠం పునాదులు కదులుతున్నాయన్న స్పృహ లేకుండా పోయింది.

విజయ భాస్కరరెడ్డి వల్ల తమ వర్గీయులకు టిక్కెట్లు తెచ్చుకోలేక పోయామన్న కసితో వై.ఎస్. రాజశేఖర రెడ్డి కూడా ఇండిపెండెంట్లను రంగంలోకి దింపి కాంగ్రెస్ అభ్యర్థులపై కాలు దువ్వుతున్నాడు. కొన్నిచోట్ల అయితే నేరుగా తెలుగుదేశం అభ్యర్థులకు మద్దతు ప్రకటించి వారి విజయానికి అహర్నిశం శ్రమిస్తున్నట్లు వార్త లందుతున్నాయి. కాంగ్రెస్ పార్టీకి కంచుకోటలా వున్న నల్గొండ జిల్లాలో మాజీ మంత్రి పురుషోత్తమ రెడ్డి ప్రభృతులు రాజీవ్ కాంగ్రెస్ పేరిట ఏకంగా కొత్త పార్టీని ఏర్పాటుచేసి కాంగ్రెస్ అభ్యర్థులపై తల పడుతున్నారు.

ప్రధానమంత్రి కూడా ఈ మారు ముఖ్యమంత్రి ఒత్తిడికి తలొగ్గి టిక్కెట్ల కేటాయింపును అస్తవ్యస్తం చేశారు. ఒక నియోజకవర్గంలో ఖచ్చితంగా గెలిచే అభ్యర్థిని వేరొక నియోజక వర్గానికి మార్చి పెద్ద తప్పు చేశారు. ఈ విధంగా అభ్యర్థుల్ని ఇష్టం వచ్చినట్లు మార్చడం వల్ల కాంగ్రెస్ పార్టీ దాదాపు ఇరవై స్థానాల్లో ఇబ్బంది పడ్తోంది. మాజీమంత్రి గుర్నాథరావు పెందుర్తిలో ఘన విజయం సాధించే అవకాశం వుండగా ఆయనను విశాఖపట్నానికి మార్చి, పెందుర్తిలో ద్రోణంరాజు కొడుకు శ్రీనివాస్‌కు టిక్కెట్టు ఇచ్చారు. కేవలం ద్రోణంరాజును సంతృప్తి పరచడానికి తీసుకున్న ఈ నిర్ణయం వల్ల ఇప్పుడు పెందుర్తి, విశాఖ కూడా పీకల్లోతు కష్టాల్లో కూరుకపోయాయి. అలాగే




పశ్చిమ గోదావరి జిల్లా ఉండిలో బాపిరాజు అత్యధిక మెజారిటీతో గెలిచే అవకాశం ఉండగా బాపిరాజును అత్తిలికి మార్చారు. రెడ్లకు టిక్కెట్లు తగ్గించాలన్న ఏకైక ధ్యేయంతో ప్రధాని కూడా గెలుపును అంతగా పట్టించుకోలేదు. మాజీమంత్రి కేశవరావుకు ఏమాత్రం సంబంధం లేని

కొరవ 13 పేజీలో

# ఐదేళ్ళ కొకసారి కన్పించే నాయకుడు వద్దు – ఐదేళ్ళూ మనతోనే వుండే సేవకుడు కావాలి!

ఓట్ల పండుగ
తరుము 'కొంటూ వచ్చింది!
ఓటరు విజ్ఞతకు
అంతలోనే పరీక్ష ఎదురైంది!
ఓటు వేయడం ఎంత
సులువు?
రంగు కాగితంపై
నచ్చిన బొమ్మ మీద
నల్లటి ముద్ర అద్దితే
అదే ఓటు!
ఐదు క్షణాల
అతి సులువైన పని!
కాని దాని విలువెంత?
కేవలం ఐదేళ్ల
తలరాతేనా?
మామూలుగా దాని
ప్రాధాన్యత అదే!
కాని, వెంకటగిరి
ఓటర్లకు మాత్రం
ససేమిరా కాదు;
ముమ్మాటికీ కాదు!
ఒక్కొక్క ఓటు ముద్ర
ఒక్కొక్క వెంకటగిరి వాని
భవితవ్యం నిర్దేశానికి
భవిష్య జీవనానికి
వేసుకొనే పునాది!



దాని విలువ
ఐదు క్షణాలు కాదు;
దాని ప్రాధాన్యత
ఐదేళ్లతో లోపించదు!
అందుకు కారణం
ఓటుకోరే వారి వరుసలో
నేదురుమల్లి జనార్ధనరెడ్డి
ప్రథముడుగా
నిల్చివుండడం;
గడచిన ఐదేళ్లలోనే
ఆయన ఐదు తరాలుగా
చూడ...
...ని



వూళ్లు అవే –
దారి డొంకలు లేవు;
పల్లెల తీరూ అదే –
దమ్మిడీకి పనికిరావు!
ఏళ్లు గడిచినా,
క్యాలెండర్లు మారినా,
తరాలు దాటుకున్నా
వెంకటగిరి

ప్రతి పల్లెటూరులోను
ఒక బడి ఏర్పడింది;
ప్రతి బడికి
అయ్యవారు వస్తున్నాడు!
ఎన్ని స్కూళ్లు?
ఎన్ని ఆస్పత్రులు?
ఎంతెంత దూరం రోడ్లు?
ఎన్ని చెరువులు

## రాచరికపు బూజుపై మోజా? రాణకెక్కిన సేవకుడికి గుర్తింపా?

తలరాత మారలేదు;
జనార్ధన రెడ్డి
ఎన్నికైనంత వరకు
అదే పరిస్థితి!
కాని ఇప్పుడు?
ఎంతలో ఎంత మార్పు?

బాగుపడ్డాయి?
ఎన్ని కాలువలు ఏర్పడ్డాయి?
నిమ్మ పరిశోధన స్థానం
చేనేత విజ్ఞాన కేంద్రం...
పోలీసు శిక్షణా కేంద్రం;
చెప్పుకుంటూ పోతే
ఎన్ని సంస్థలు
వెంకటగిరిలో
కుదురుకున్నాయి?
ఎంతెంత అభివృద్ధి
జరిగింది మన కళ్లముందు?
ఇంకెంత అభివృద్ధి
జరగాల్సి వుంది?

## అభివృద్ధి రథాన్ని అందరం కలసి నడిపిద్దాం రండి!

వేసి చూపించడం.

1989లో జనార్ధన రెడ్డిగారు ఎమ్మెల్యేగా గెలవక ముందు వెంకటగిరి ఎట్లా వుండింది? ఇప్పుడెట్లా వుంది? అభివృద్ధి అనే పదానికి మనకు ఇంతకాలం అర్థమే తెలియదు. రెండు, మూడు వందలేళ్లు జమీందార్లు మనల్ని ఏలారు. అట్లాంటిట్లాంటి ఏలికలా వారు? మనముందు తరాల వారికి బ్రతికుండగానే నరకం ఎట్లుంటుందో చూపించిన మహత్తర పరిపాలకులు. జమీందారీ విధానమంటేనే యావత్ దేశం ఏవగించుకొనే రీతిలో రైతాంగాన్ని నరక యాతన పెట్టినవారు. ఇక్కడ రగిలిన జమీందారీ విధాన వ్యతిరేక అగ్ని కణమే, ఆ తర్వాత తర్వాత ప్రజ్వరిల్లి, దావాగ్నిగా మారి భారత దేశమంతా జమీందారులు మాడిమసై పోయారు.

వారి పాలనలో చెరువుల బాగుకు చిల్లిగవ్వ ఖర్చు పెట్టేది లేదు కాని, శిస్తులు మాత్రం ముక్కుపిండి, గిన్నె బొచ్చ వీధిలో వేసి దౌర్జన్యంగా దండేవా...

మనుషులు నడవడానికి రోడ్లవసరమని ఎప్పుడూ తెలుసుకోలేదు; పశువులు తిరిగేందుకు పుల్లరి దండేవారు. ఈ ఫ్యూడల్ దౌర్జన్యాల నుంచి, ఈ



పెత్తందారీ పోకడల నుంచి బయట పడడానికి ఎంత కష్టపడ్డారు మన పెద్దలు? ఎన్నెన్ని పోరాటాలు చేశారు?
జమిందారీలు పోయాయి;
జమిందార్లు పోయారు;
ఎన్నో ఎన్నికలు జరిగాయి;
ఎందరో ఎమ్మెల్యేలు
గెల్చారు;
పదవులననుభవించారు;
పాలకులుగా వెలిగారు;
కాని మనకేమి ఒరిగింది?
...ఏలు... ?

ఐదంటే ఐదేళ్లలో
యాభై సంవత్సరాలలో
జరగని,
ఏ నాయకుడూ
జరిపించలేని
అభివృద్ధిని
జరిపించి
చూపించాడు!
ఆరేడు మైళ్లు నడిస్తే కాని
బస్సు దొరకని దుర్గతి
ఏ గ్రామానికి లేదిప్పుడు;
ప్రతి వూరుకూ రోడ్డుపడింది;
గ్రామ గ్రామానికి బస్సు
వుంది!
త్రాగేనీళ్ల కోసం
దిగుడు బావుల్లో
దేవులాడాల్సిన దుస్థితి లేదు;
ప్రతి పల్లెటూరుకు
రక్షిత నీటి పథకం
రానైనా వచ్చింది;
రాబోతూనైనా వుంది!
బడి కోసం పిల్లలను
ఎక్కడెక్కడికో పంపలేక
చదివింది చాల్లే అని
ఇంట్లో కూలేసే కర్మ లేదు;



ఇంత చేసింది,
ఇంకెంతో చేయబోతున్నదీ
ఒకే ఒక్క నాయకుడు;
బక్క చిక్కిన బడుగు
జనం సేవకుడు!
ఐదేళ్లకొకసారి
తళుక్కున మెరిసి
ఆ తర్వాత అంతు
చిక్కని నాయకులు
మనకు వద్దు!
ఐదేళ్ల పాటు

కొరవ 12 పేజీలో

# పి.వి. తడబాటు

కాలు జారినా వెనక్కు తీసుకోవచ్చుగాని, నోరు జారితే చేయగల్గిదేమీ వుండదు. రాజకీయాల్లో, అదీ ఎన్నికలవంటి సున్నిత సమయంలో ఒక్కపొల్లు మాట మాట్లాడినా దాని ప్రభావం విపరీతంగా వుంటుంది. మంచైనా, చెడైనా అంతే !

సాక్షాత్తు ప్రధానమంత్రి శ్రీ పివి నరసింహారావు గారే అప్పుడిటువంటి సంకటంలో పడిపోయారు. సాధారణంగా పివి ఆచితూచి మాట్లాడుతారు ; ఆలోచించవిదే నోటినుంచి శబ్దం వెలికిరాదు. ఎంతటి వాడైనా ఒక్కొక్కసారి పొరపాట్లు చేయడం సహజం కదా. గతనెల రాష్ట్ర పర్యటనలో ఆయన ఒకటి రెండు సభల్లో మాట్లాడుతూ "రానున్న శాసనసభ ఎన్నికల ఫలితాలెట్లా వుంటాయోనని యావత్ ప్రపంచం ఎదురు చూస్తున్నది; ప్రధాని స్వంత రాష్ట్రంలో ప్రజలు ఎట్లా ప్రతిస్పందిస్తారనే ఆసక్తి సర్వత్రా వుంది. అందువల్ల ప్రజలు నా పదవి ప్రతిష్ట నిల్పే విధంగా ఓటు చేయాలి" అని చెప్పారు. ఎంతో సంచలనం సృష్టించింది ప్రసంగం. ఆంధ్ర, కర్నాటక ఎన్నికల ఫలితాల ఆధారంగా ప్రధాని రాజకీయ భవిష్య పరిణామాలు వుంటాయన్న ప్రచారం జోరుగా జరిగింది. ప్రధాని పరిపాలనపై వీటినొక రెఫరెండం వలె భావించాలనే వాదం బయలుదేరింది.

చాలా ప్రమాదకరమైన వాదం ఇది. అందువల్లే ప్రధాని ఈ వారంలో కర్నాటకలో జరిపిన మలి పర్యటనలో దీనిపై సుదీర్ఘ వివరణ ఇచ్చారు. నేనా ఉద్దేశ్యంతో ఆ మాటలన లేదన్నారు. తన పరిపాలనకు, ఈ ఎన్నికల ఫలితాలకు సంబంధం లేదని, వీటి ప్రభావం తన పదవిపై వుండబోదని స్పష్టం చేశారు. ప్రధాని స్థాయిలో ఈ మాటల తడబాటు దురదృష్ట కరమైన విషయం.

నిజానికి ఆంధ్ర, కర్నాటక రాష్ట్ర శాసనసభ ఎన్నికలకు, ఢిల్లీలోని ప్రభుత్వానికి లంకె కుదర్చడం అనవసరం. శాసనసభల ఎన్నికలను రాష్ట్ర పరిస్థితులు, రాష్ట్ర సమస్యలు, రాష్ట్ర రాజకీయ వాతావరణాలే ప్రభావితం చేస్తుంటాయి. ఇక్కడి నాయకుల ప్రవర్తన ఆధారంగానే ఓటర్ల నిర్ణయం జరుగుతుంటుంది. కేంద్ర ప్రభుత్వపు విధానాలు, పరిపాలనపై అసెంబ్లీల ద్వారా తమ అభిప్రాయాలు ప్రకటించాలని ప్రజలెప్పుడూ భావించరు. అందులోనూ ఆంధ్రప్రదేశ్‌లో వుండే ప్రధాన ప్రతిపక్షం ఒక ప్రాంతీయ పార్టీ. వారు ఢిల్లీకి పోయేది లేదు, కేంద్ర ప్రభుత్వంలో వుండేది లేదు.

ఇంకొక కోణంనుంచి చూస్తే కేంద్రంలో కాంగ్రెస్ ప్రభుత్వం ఏర్పడక ముందే ఆంధ్ర, కర్నాటక ప్రభుత్వా లేర్పడినాయి. ఈ ఐదేళ్లలో ఆయా నాయకుల పనితీరు పట్ల ప్రజలకు స్పష్టమైన, నిర్దిష్టమైన అభిప్రాయా లేర్పడి వుంటాయి. వాటి కనుగుణంగానే వారు నిర్ణయం తీసుకొంటారు. పైగా, రాష్ట్రంలో కాంగ్రెస్ పార్టీ ఎన్నికల ప్రణాళికకు, కేంద్ర విధానాలకు సంబంధం లేదు. ప్రజలను ప్రత్యక్షంగా ప్రభావితం చేసే సబ్సిడీ బియ్యం, గృహనిర్మాణం వంటి పథకాలు; స్థానిక పాలనలో సమర్థత, అవినీతి వంటివి రాష్ట్ర విషయాలు. ఈ దృష్టితో చూసినప్పుడు ఇక్కడ కాంగ్రెస్ ఓడితే పివి ఓడినట్లు, గెలిస్తే పివి గెల్చినట్లు భావించడం పొరపాటౌతుంది.

అయితే ఢిల్లీ గద్దనెక్కిన తొలి తెలుగు బిడ్డగా, ఆంధ్రలో పివి పట్ల ప్రజలలో ప్రత్యేక అభిమానం ఏర్పడి వుండాలి. పివికి కూడా ఆ అనుబంధపు స్పృహ వుంటుంది. అటువంటి అనుబంధాన్ని వ్యక్తం చేయడంలో ఆయన తొందరపడి వాడిన ఒక్కమాట ఇంతదూరం వెళ్లింది. అంతే !

పివి నరసింహారావుగారు ప్రధానిగా ఎంతటి సున్నిత పరిస్థితులలో తన పదవి నిర్వహిస్తున్నారో తెలుసుకోవడానికి ఇదొక ఉదాహరణ. ఆయన దేముందిలే - ఇప్పుడె క్కించినా, ఎప్పుడు కావాలంటే అప్పుడు దింపేయ వచ్చునన్న * తేలిక భావంతో వుండిన కేంద్ర కాంగ్రెస్ నాయకులు - పివి కుర్చీకి బంక పూసి అతికించినట్లు అతుక్కు పోవడంతో దిగాలు పడిపోయారు. శరద్‌పవార్, అర్జున్‌సింగ్, నారాయణ్‌దత్ తివారి వంటి కొమ్ములు తిరిగిన యోధులు తమావకాశ్ము ఎప్పుడు దొరుకుతుందో అర్థంకాక ఆకలిగొన్న సింహాలవలె ఎదురు చూస్తున్నారు. ఉత్తరప్రదేశ్ ఎన్నికల ఓటమినే వారు తమకనుకూలమైన అవకాశంగా మార్చు కోవాలని చూశారు. వీలు కాలేదు. అవిశ్వాస తీర్మాన గండాలు, అసమ్మతి చికాకులు ఎన్ని కల్పించినా పివి తప్పించుకొన్నారు. ఈ పరిస్థితులలో ఆంధ్ర, కర్నాటకలలో కాంగ్రెస్‌కు ఓటమి ఎదురైతే వారు వదలిపెట్టరు. ఒక్కపారిగా విరుచుక పడతారు. పదవినుంచి దిగ పొమ్మంటారు.

ప్రతిపక్షాలూ ...రుకోవు. ఈ ...కలు, అరుపులను ఎదుర్కొనే చాతుర్యం పివికి పుష్కలంగా వున్నప్పటికీ, దేశ ఆర్థిక వ్యవస్థ సక్రమ నిర్వహణకు అది ఆటంకాలు కల్పిస్తుంది; అనిశ్చిత వాతావరణం సంస్కరణల కొనసాగింపుకు అవరోధం.

తెలుగు ఓటర్లు ఈ ప్రమాదం పసిగట్టి, సరైన నిర్ణయం తీసుకొంటారనే ఆశిద్దాం !

జమీన్‌రైతు

17-11-1944

పేజీలు: 8, వెల: 0-1-6

## వారేమంటున్నారు

కార్మికులతోను, కర్షకులతోను కాంగ్రెస్ వాదులు కలిసిమెలసి తిరుగుతూ, వారిలో రాజకీయ చైతన్యం కలిగించి, యీ క్లిష్ట పరిస్థితులలో దేశీయులందరికీ తిండి గుడ్డచేకూర్చే ప్రయత్నం చేస్తూ గ్రామ పరిశ్రమల నుద్ధరిస్తూ తన నిర్మాణ కార్యక్రమ సూత్రాలను అమలు జరపాలని అదే ప్రతి కాంగ్రెసువాదికి విద్యుక్త ధర్మమని మరొకసారి మహాత్ముడు హెచ్చరించారు.

నిజంగా మహాత్ముని ఆ హితబోధలో ఆ ధర్మ రహస్యంలో ఎంత మహత్తరశక్తి వున్నదో కాంగ్రెస్‌వాదులు గమనించాలి. ఉద్యోగపు హోదాలన్నా రాజకీయాలన్నా పూలదండలు వేయించుకొని లెక్చర్లు కొట్టడమన్నా ఎంత ఆతృతతో ముందుకురుకుతారో అంత ఆతృతతో అంత యుత్సాహంతో ఏనాడు మహాత్ముని నిర్మాణ కార్యక్రమ సూచనల నమలు జరుపుతారో ఆనాడు భారతజాతికి ముక్తి కలుగుతుంది. ఆనాడు 40కోట్ల భారతీయులకు స్వరాజ్యం వస్తుంది.

ప్రజావాణి

### నెల్లూరు ముచ్చట్లు జిల్లాబోర్డు

ఆస్పత్రి పాయలబదాశ సన్నపనిది శేషురెడ్డిగారి దానం. యేమిటేశారయ్యా: శ్రద్ధగా పట్టిచేస్తే యీనాటికైనా ఒక లక్ష మిగులుతుంది. త్వరగా కథసాగించి ఆసుపత్రిపని ప్రారంభించమని గోవిందరెడ్డి గారికి మనవి. విల్‌నామా ప్రకారం ఆ మొత్తాన్ని బోర్డుఫండులో కలపకుండా వేరే బడ్జెటు వుండాలె సుమండీ!

### మునిసిపాలిటి

ఎవరా శానిటరీ యిన్‌స్పెక్టరు? ఆడవాళ్ల విషయంలో మట్టుమర్యాద అక్కర్లేదా? స్టోన్‌హౌసుపేటలో ఎవర్ని విచారించినా చాలాగోలగా చెపుతున్నారు. ఇకనన్నా జాగ్రత్తగా మెలగడం అవసరం.

## 50 ఏళ్లక్రితం ఈ వారం

30 సంవత్సరాలుగా నీటిపన్నుగడుతూ కొళాయినీళ్లుతాగే జాతకం లేక యేడుస్తున్నారు పొగతోటవారు. కాని, "విన్నకుప్పనిడల్లు" అన్నట్లు బృందావనానికి పైపువస్తుందంటె వింతగావుంది. క్షారోదకాలుగల్గిన బృందావనానికి మంచినీటి వసతి కల్పించడం అవసరమేగాని, పొగతోటను మరిచిపోవడం మాత్రం భావ్యంగాదు.

హెల్తుశాఖ సజీవంతో వున్నదా? 16 లక్షల జనసంఖ్యగల్గిన జిల్లాకు ఒక హెల్తు ఆఫీసరుంటె, 55 వేల జనాభా గల్గిన టవునుకు మాత్రం ప్రత్యేకంగా ఒక హెల్తు ఆఫీస

కొనవ 19 పేజీలో

# చౌకడిపోల్లో సరుకుల సరఫరా ప్రభుత్వ ప్రచారానికే పరిమితమా?

చౌక ధరల దుకాణాల ద్వారా పౌర సరఫరాల శాఖ నిత్యావసర వస్తువులైన బియ్యం, పంచదార, గోధుమలు, పామోలిన్‌లను పంపిణీ చేయిస్తున్నది. ఒక్కొక్క కుటుంబానికి ఇచ్చే నెలసరి కోటా ఏమాత్రం చాలడంలేదు. ఒక కుటుంబానికి ఇచ్చే బియ్యం గరిష్టంగా 25 కిలోలిచ్చి సరిపెట్టుకుంటున్నారు. పామోలిన్ నూనె ప్రతి కార్డుకి అరకిలోనే ఇస్తారు. ఈ అరకిలో నూనె నెలలో వారంరోజులకు మాత్రమే ఒక మోస్తరు కుటుంబానికి సరిపోతుంది. మిగతా మూడో వారాలు అధిక ధర చెల్లించి మార్కెట్ నుంచి వేరుశెనగ నూనె తెచ్చుకోవలసిందే. పండగ పబ్బాల సమయంలో అదనపు కోటా మంజూరులో కూడా పౌర సరఫరాలశాఖ అవాస్తవిక ధోరణిని అనుసరిస్తున్నది. పండుగ కోటా అంటూ కేవలం అరకిలో ఇస్తే ఎలా సరిపోతుంది? చాలీ చాలని రీతిలో పౌరసరఫరాలు అందించడంవల్ల పేద ప్రజలకు ఏవిధంగానూ ఊరట కలుగదు. పౌర సరఫరాలు ప్రభుత్వ ప్రచారానికి మాత్రమే పనికి వస్తున్నాయి.

నెల్లూరు -ఎ. శారద.

### ఆటోవాళ్లగోల

ఇటీవల కాలంలో ఆటోవాళ్ల గోల ఎక్కువైంది. కరెంటు ఆఫీసు సెంటర్లో బస్సులకోసం నిలబడి వుండే వుద్యోగినులను నానా రకాల మాటలతో టీజ్ చేస్తున్నారు. 'రోజా 3రూపాయలు పెట్టి ఆటో ఎక్కలేం గదా ? ప్రైవేట్ బస్సులు ఎక్కడ బడితే అక్కడ ఆపుతారని మామూలుగా ఆర్టీసి బస్సులకోసం వుద్యోగినులు ఎదురు చూస్తుంటారు. బస్సులకోసం నిలబడి వుంటే ఆడవాళ్లను ఆటో కావాల్నా అని ఒకరు అడిగితే, ఇంకొకరు ఎక సక్కెంగా వాళ్లంతా బస్ సర్వీస్ వాళ్లురా అంటూ పోతుంటారు. ఆడవాళ్లపై ఛండాలమైన కామెంట్ చేసే ఆటో డ్రైవర్లు టౌన్‌లో కోకొల్లలు. ఇటువంటి వారి భరతం పట్టను కొన్ని సెంటర్లలో మఫ్టీ మహిళా పోలీసులను పెట్టి, ఆటో డ్రైవర్లకు తగిన బుద్ధి చెప్పి, వుద్యోగినులకు రక్షణ కల్పించ వలసిన బాధ్యత పోలీసులపై వుంది.

నెల్లూరు -శివప్రియ.

## జనవాణి

### వేదాలు, పురాణాలకు మార్క్సు సిద్ధాంతం

'సర్వేజనా సుఖినోభవంతు' అనే సూక్తిలో నిబిడీకృతమైన విస్తృత భావాన్ని వేదాలు, వేదాంతులు ప్రబోధించడం వరకే పరిమిత మయ్యారు. కాని సర్వమానవ సమాజం సుఖ శాంతులతో వర్ధిల్లాలని ఒక మార్గం కనిపెట్టి నిర్వచించాడు కారల్ మార్క్సు. మార్క్సిజం మన వేదాలు,పురాణాలు ప్రబోధించిన మానవతకు ప్రజాశ్రేయస్సుకు భిన్నంకాదు. మంచి సంకల్పాలతో మంచి కార్యాలుచేసి మంచిగా ప్రవర్తించమని అన్ని మతాలు చెబుతాయి. ఈ మహోన్నత ఆశయ సాధనకు వుపకరిస్తుంది మార్క్సిజం. అనాదిగా భూస్వాములు, పెట్టుబడిదారుల దోపిడీకి గురైన కార్మిక, కర్షకులు మార్క్సు సిద్ధాంత చైతన్యంతో పోరాడి విముక్తి పొంది సోషలిస్టు రాజ్యాలు ఏర్పరచు కున్నారు. ఆశయాలు, సిద్ధాంతాలు మంచివైనా ఆచరణ లోపంతో రష్యాలో సోషలిస్టు వ్యవస్థ కుప్ప కూలిపోయింది. ఈ దినాల్లో ఎటు చూసిన అధర్మం, అన్యాయం, అరాచకం, ప్రబలి పోతున్నది. దీనికి పరిష్కార మార్గం ఒక్కటే. వేదాలు, పురాణాలు ప్రబోధించిన ఆశయాలకు మార్క్సు సిద్ధాంతాన్ని జోడించి ప్రజలను చైతన్యపరచి మంచి వ్యక్తులను ఎన్నుకోవడం ద్వారా దోపిడీ రహిత సమాజాన్ని నిర్మించుకోవడం చాలా అవసరం.

నెల్లూరు -ఎ. శ్రీరాములు.

### టౌన్‌బస్సులతో ఇబ్బంది

టౌన్‌లో తిరిగే టౌన బస్సులు

కొనవ 19 పేజీలో

# ఉదయించిన ప్రగతి సిరి ఉదయగిరి

## కన్నీళ్లతో కాటకాలు తొలగవు



ఎంత గంభీరమైన పేరది!
కాని లాభమేమిటి?
పేరులోనే దానికి
'ఉదయం';
వర్తమానమంతా
అస్తమయం!
వినడానికే 'గిరి' సమం;
ప్రగతి తీరులో అదొక
విపీలకం!

వెయ్యేళ్ల తెలిసిన చరిత్రలో ఉదయగిరి దుర్గం అనుభవించిన స్వర్ణయుగాలెన్నో! విలపించిన నరకతుల్య దుర్భర క్షణాలూ అన్నే! అందుకే ఆ దుర్గం అంత గాంభీర్యతను ప్రదర్శిస్తుంది;



అంత దయనీయతనూ ప్రతిఫలిస్తుంది.

ఉదయగిరి దుర్గం ఎంతో
ఉదయగిరి ప్రజలూ అంతే!
గతం తప్ప వర్తమానం లేదు.
భవిష్యత్ పట్ల ఆశలేదు.
అంతా చీకటి!
వట్టి కారు చీకటి!

అందుకే ఉదయగిరి అంటే అందరికీ అంత చులకన; అంత తేలిక భావం; అంత ఎగతాళి! ఉదయగిరికి బదలీ అంటే [illegible] జిల్లా [illegible]నాయకులకు కూడా [illegible] శిక్ష వలె అనిపిస్తుంది. ఉదయగిరి పేరు చెప్తే రాళ్లు రప్పల బీడు భూమి కళ్ల ఎదుట కదలాడుతుంది; ఉదయగిరి వూళ్ల కెళ్లడమంటే రాయలసీమలో తిరుగాడినట్లుగా వుంటుంది.

ప్రకృతికీ ఉదయగిరి అంటే చిన్నచూపు; పాలకులకూ ఉదయగిరి అంటే సవతి ప్రేమ! ఇద్దరూ కలసి తరాల తరబడి దాన్ని నిర్దయగా చూశారు; నిర్లక్ష్యం చేశారు! ఫలితం? వేరే చెప్పబని లేదు; ఒకసారి వెళ్ళిచూస్తే చాలు! రాయల కాలం నాటి రహదారులు, చెరువులు! ఆ రోడ్లపై నడవబోతే ఎడ్లబండ్లకు ఏడుపు వస్తుంది; ఆ చెరువుల కేసి చూడను వాన చినుకుకూ సిగ్గేస్తుంది! ఒకటా? రెండా? మూడా? సంవత్సరాలా? దశాబ్దాలా? శతాబ్దాలు కూడానా? ఎన్నేళ్లు గడిచినా, ఎన్ని తరాలు మారినా ఉదయగిరి తలరాత మాత్రం మారలేదు!

ఉదయగిరి నెల్లూరులో ఒక భాగమని చెప్పుకోవడానికి చాలా మంది ప్రజాస్వామ్య పాలకులు వెనుకాడేవారు. అందుకు కారణం లేకపోలేదు. రైలు కట్ట వెంబడి, జాతీయ రహదారి నానుకొని పచ్చగా, పసిమితో మిస మిస లాడుతూ వుండే పైర్లు, పొలాలు, దాటుకుంటూ; అప్పుడప్పుడైనా పరవళ్లు [illegible], పెన్నా నదిని తిలకిస్తూ; థర్మల్ కే... గొట్టాల నుంచి పైకెగసి ఆకాశంలో మబ్బు కట్టిన పొగను చూస్తూ వెళ్లే వారి దృష్టిలో
నెల్లూరు జిల్లా
అంటే సుభిక్ష ప్రాంతం!
సస్యశ్యామల మాగాణం.

చంద్రునికి మచ్చలాగా, గంధర్వకన్య ముఖంపై నల్లటి పొడలాగా నెల్లూరు జిల్లాలో ఉదయగిరి వుందని చెప్పుకోవడానికి, చూపించడానికి పాలకులు సిగ్గుపడ్డంలో వింతేమి వుంది?

కాని ఇదంతా భూతకాలం!
ఐదేళ్ల నాటి పాత అలవాటు!
మాదాల జానకిరాం
ఎమ్మెల్యేగా ఎన్నిక
కాకముందు నాటి
కథలు, వెతలు అవి!
జానకిరాం ఎమ్మెల్యేగా



ఎన్నిక కావడంతో
పల్లవుల నాటి
పసిడి రోజులో
చోళుల పాలనలోని
సువర్ణ దినాలో
మళ్లీ వచ్చాయని
చెప్పలేముగాని
ఇరవయ్యో శతాబ్దపు
సంధ్యాసమయంలో
ఇరవై ఒకటో శతాబ్దపు
ఉషోదయ వెలుగు రేఖలు
ఉదయగిరి చీకటి కోనపై
ప్రసరించాయని మాత్రం
చెప్పక తప్పదు!

గడచిన ఐదేళ్లలో [illegible] ఉదయగిరి చీకటి కోనల్లో కాంతి కిరణాలు ప్రసరింపచేయడానికి ఎంత తపించాడో, పరితపించాడో, తపస్సు చేశాడో, తంటాలు పడ్డాడో, మాటల్లో చెప్పలేము.

ఐదారు శతాబ్దాల
దారుణ నిర్లక్ష్యానికి
బలైపోయిన
ఒక ప్రాంతపు తలరాతను
ఐదేళ్ల స్వల్ప వ్యవధిలో
తారుమారు చేయడానికి
జానకిరాం
దేముడు కాదు;
ఆయన చేతిలో
అల్లావుద్దీన్
అద్భుత దీపమూ లేదు!
కాని,
ఈ కొద్ది సమయంలో
జానకిరాం
ఏ అవకాశమూ
వదలి పెట్టలేదు;
ఏ అధికారినీ పట్టిన
పట్టు వదల లేదు;
ఏ నేత పరిచయాన్నీ
విస్మరించలేదు!
అందుకే
1989 నాటి ఉదయగిరికి
నేటి ఉదయగిరికి
మధ్య అంత తేడా!
ఒకటి కాదు,
రెండు కాదు,
మూడూ కాదు –
90 కోట్లు –
అక్షరాల తొంభై కోట్లు
తరలించుకవచ్చాడు!
స్వాతంత్ర్యం వచ్చిన
నాలుగున్నర దశాబ్దాలలో
ఓ వెలగబెట్టుకొని
దర్జాగా అధికార
దర్పమనుభవించిన
ఎందరెందరో
మహానుభావులు,
పెద్ద పెద్ద పేర్లున్న
మహా నాయకులు
వేయలేకపోయిన
అభివృద్ధిని
చూప లేకపోయిన
ప్రగతి శ్రద్ధను
జానకిరాం ఒక్కడూ
అహోరాత్రుల శ్రమతో
అహరహం పరిశ్రమతో
అధినాయకుల అండతో
అధికారుల తోడ్పాటుతో
అంది వచ్చిన అవకాశాలతో
చేసి చూపించాడు;



చూపి చేయించాడు!
జానకిరాం ఐదేళ్ల
ఎమ్మెల్యే సేవతో
ఉదయగిరిలో
ఈనాడు ప్రగతి సిరి
ఉదయించింది!
తొలి వేకువ
తుషార కిరణం
మంచు తెర అడ్డు
తొలగించుకొని
మెల్ల మెల్లగా
ధరిత్రి పై
ప్రసరించినట్లు,
తరతరాల



నిర్లక్ష్యపు ప్రభావానికి
అభివృద్ధి రాహిత్యానికి
వెనుకబాటు తనానికి
గురైన, బలైన
ఉదయగిరి సీమలో
జానకిరాం
ప్రజాసేవా ఫలం
ప్రజానీకపు
ప్రయోజనానికి
అందివస్తున్నది!

అయితే ఇది కేవలం మొదలు; ప్రారంభం; ఉదయం!

మిగతా 14 పేజీలో

# ఆంక్షలు ధిక్కరిస్తే అభ్యర్థిత్వం రద్దు చేస్తాం!

అసెంబ్లీ ఎన్నికల్లో అభ్యర్థి ఖర్చు చేయవలసిన మొత్తం నియంత్రణతోపాటు రోజుకొకటిగా వచ్చి పడ్తున్న నియమ నిబంధనలు పోటీ చేస్తున్న అభ్యర్థులకు గొంతులో పచ్చి వెలక్కాయ పడినట్లున్నాయి. చీటికి మాటికి ప్రత్యర్థులపై అధికారులకు ఫిర్యాదు చేసుకొనేందుకు నిబంధనలు భలేగా వుపయోగ పడుతున్నాయి. అభ్యర్థులు పెడుతున్న

### కలెక్టర్ హెచ్చరిక

ఖర్చు, చూపిస్తున్న లెక్క ''చెవులో పువ్వేనని'' అధికారులకు తెలుసు. సాధ్యమైనంత వరకు సర్దుకు పోతున్నారు. కొంతమందైతే నోటీసులు జారీ చేస్తున్నారు. 12 తేది కస్తూరిబా కళాక్షేత్రంలో కలెక్టర్ ఏర్పరచిన అన్ని నియోజకవర్గాల అభ్యర్థుల, వారి ఏజంట్ల సమావేశంలో నిబంధనలు గాలికి వదిలేసే విషయమై ఒకరిపై మరొకరు ఆరోపణలు చేసుకొన్నారు: కలెక్టర్ గారు అన్ని విషయాలపై దర్యాప్తు చేయమని రిటర్నింగ్ అధికారిని ఆదేశించారు. సమావేశంలో కలెక్టర్ మాట్లాడుతూ నామినేషన్ల ఘట్టం వరకు అభ్యర్థుల సహకారం సంతృప్తికరంగా వుంది ; ఇకపై కూడా ఇటువంటి సహకారమే కావాలని రాజకీయ పార్టీలను కోరారాయన. ఎన్నికల ప్రచార ఘట్టంలో డబ్బు, మద్యం ఐట్వాడా, హింసా పద్ధతులకు తావివ్వకుండా అభ్యర్థులు వ్యవహరించాలి. ఎన్నికల నియమావళి తు.చ. తప్పకుండా పాటించేందుకు చర్యలు తీసుకొంటున్నాము. కుల, మత, వర్గ, ప్రాంతాల ప్రస్తావన తెచ్చి ప్రచారం చేస్తే అలా ప్రచారం చేసిన వారి అభ్యర్థిత్వాన్ని రద్దు చేస్తామని హెచ్చరించారు.

### నెల్లూరు సంగతులు

నెల్లూరు తెలుగుదేశం అభ్యర్థి కాంగ్రెస్ అభ్యర్థి పివి ప్రసన్నరెడ్డి తన ప్రచారంలో ఎన్నికల నియమావళి అతిక్రమిస్తున్నారని కలెక్టర్ ముందు ఆరోపణలు సంధించారు. ప్రచారంలో ఒకే కారును వాడుతున్నట్లు లెక్క చూపించి మూడుకార్లను వినియోగిస్తున్నారంటూ కార్ల నెంబర్లు కలెక్టర్‌కు ఇచ్చారు. ఇంటింటికి వుచితంగా బియ్యాన్ని, డబ్బులు, వస్త్ర సామాగ్రిని అందజేస్తున్నారని ఫిర్యాదు చేశారు. ఫత్తేఖాన్ పేటలో నీటిబోరు ఏర్పాటు చేసినట్లు కలెక్టర్ దృష్టికి తీసుకెళ్లారు. సింహపురి మైనారిటీస్ వెల్ఫేర్ అసోసియేషన్ పేరుతో మతపరమైన జెండాలు వాహనాలకు కట్టుకొని ప్రచారం సాగినట్లు చెప్పగా రిటర్నింగ్ అధికారిని ఈ విషయాలపై దర్యాప్తు జరపమని ఆదేశించారు. ఈసారి ఎన్నికల్లో భోజనం, టిఫిన్లు ప్రభుత్వం ద్వారానే సరఫరా చేయాలని నిశ్చయించినట్లు కలెక్టర్ చెప్పారు. గూడూరు నియోజకవర్గం నుంచి పోటీచేస్తున్న ఒక ఇండిపెండెంట్ అభ్యర్థి తమ నియోజకవర్గంలో కొన్ని ప్రాంతాల్లో బలమైన ఒక వర్గంవారు ప్రజలను ఓట్లు వేయనీరని, రిగ్గింగ్ చేసుకొంటారని అందుకుగాను పర్యవేక్షక అధికారులకు భోజనాలు, టీలు, టిఫిన్లు సరఫరా చేస్తారని ఆరోపించారు. ఈ విషయమై కలెక్టర్ అప్పటికప్పుడు స్పందించి ప్రభుత్వ పద్దునుంచే ఈ ఖర్చులు పెట్టమని గూడూరు రిటర్నింగ్ అధికారిని కోరారు. సమావేశంలో జాయింట్ కలెక్టర్ సతీష్‌చంద్ర, పోటీ చేస్తున్న అభ్యర్థులలో రమేష్‌రెడ్డి, మాదాల జానకిరాం, ప్రతినిధుల జాబితాలో పి.సునీల్‌కుమార్ రెడ్డి తదితరులు, 11 నియోజకవర్గాల రిటర్నింగ్ అధికారులు పాల్గొన్నారు.

### మహిళా కాంగ్రెస్ సమావేశం !

టౌన్ మహిళా కాంగ్రెస్

కొరవ 11 పేజీలో

## సణుగుడు

### • శేషన్‌ను మించి పోతున్నారు కలెక్టరు గారు !

శేషన్‌తోనే వేగలేక ఎన్నికల్లో పోటీ చేసే అభ్యర్థులకు చెమటలు పడుతుంటే, నెల్లూరు జిల్లా కలెక్టర్ శ్రీ సాంబశివరావు గారు వారికి మరీ శోష వచ్చేటట్లు హడలెత్తిస్తున్నారు. శేషన్ నిబంధనలను అభ్యర్థులు మనసా, వాచా, కర్మణా ఆచరించేట్లు చూడడంలో కలెక్టర్ తీసుకొంటున్న జాగ్రత్తలు, వ్యవహరిస్తున్న కఠిన వైఖరి రాజకీయ పార్టీలకు కంటిమీద కునుకు లేకుండా చేస్తున్నాయి.

ఎలక్షన్ కమీషన్ నుంచి రోజూ వచ్చే ఆదేశాల తోపాటు, మొత్తం ప్రజాప్రాతినిధ్య చట్టాన్నే ఔపోసన పట్టినట్లున్నా డాయన. ఏ తప్పుకు, ఏ అతిక్రమణకు ఏ సెక్షన్ ప్రకారం ఏ శిక్ష విధించే అవకాశం వుందో గడగడ అప్పచెప్పేస్తున్నారు. న్యాయవాదులు కోర్టులో వాదించేటప్పుడైనా సెక్షన్‌ల కోసం తడుము కొంటారేమో గాని, కలెక్టర్ గారు మాత్రం తడబడడం లేదు.

ఈ దెబ్బకు జిల్లాలో ఎన్నికల సిబ్బంది కూడా, రిటర్నింగ్ ఆఫీసర్లతో సహా హడలి పోతున్నారు. అభ్యర్థుల ప్రచారం తీరును వెయ్యి కళ్లతో గమనిస్తున్నారు. నెల్లూరు టౌన్‌లో అక్కడక్కడా హస్తం ఎలక్షన్ కటౌట్లు వెలిశాయి. ప్రజా ప్రాతినిధ్య చట్టంలో అది తప్పని చెప్పి లేదు; కాని, ట్రాఫిక్ చట్టంలో ఎక్కడో ఒక సెక్షన్ వుంది. ఆ పుస్తకం దుమ్ము దులిపి, వెలికితీసి, చదివి, ఎందుకొచ్చిన న్యూసెన్స్ అనుకొని కటౌట్లను తొలగించేశారు.

కరెంట్ స్తంభానికో, టెలిఫోన్ పోల్‌కో జెండా కడితే నేరంగా పరిగణిస్తున్నారు - అవి ప్రభుత్వ ఆస్తులు కాబట్టి, వాటిని ఆధారంగా చేసుకొని తాడు కడితే దుర్వినియోగం క్రింద వస్తుందట. ఇందుకూరు పేటలో కావోలు - సమితి ఆఫీసు ప్రహరీ గోడ ఎక్కి చుట్టూ చేరిన జనానికి ఉపన్యాసం దంచిన ఒక అభ్యర్థికి నోటీసు ఇచ్చారు. ఎమ్మార్వోలు, ఆర్డీవోలు, ఆర్‌ఐలు వీడియో కెమెరాలు పట్టుకొని పరుగులు తీస్తున్నారు. ఎక్కడైనా లోపం జరిగితే, శేషన్ దాకా

### డోలేంద్ర

పోకుండా, కలెక్టరే ఉద్యోగం పీకించేస్తాడన్న భయం నెలకొని వుంది వారిలో !

ఎన్నికల సిబ్బంది కేటాయింపు అంతా చిదంబర రహస్యమట. నియోజక వర్గానికంతటికీ కలిపి, అందర్నీ ఒక ఆఫీసు దగ్గరకు పిలుస్తారు. అప్పుడు రూట్ ఆఫీసర్లెవరో ప్రకటిస్తారు. ఆ తర్వాత సీల్డు కవర్‌లో వారికి కేటాయించిన సిబ్బంది జాబితా ఇస్తారు. దాన్ని చించి, ఆయా పేర్లు పిల్చి తమకు

కొరవ 11 పేజీలో

# పెంచలకోన స్మగ్లింగ్ కేంద్రంగా మారుతూంది!

### వ్యక్తిగత అభిప్రాయాలే !

ఈ సంచికలో వెంకటగిరి, రాపూరు, ఆత్మకూరు, కావలి, ఉదయగిరి, సర్వేపల్లి, కోవూరు, గూడూరు, సూళ్లూరుపేట నియోజక వర్గాల కాంగ్రెస్ అభ్యర్థుల గురించి 2, 4, 6, 8, 12, 14, 16, 18, 20 పేజీలలో ప్రచురింప బడిన వ్యాసాలు ఆయా అభ్యర్థుల అనుచరులు, వారి శ్రేయోభిలాషుల వ్యక్తిగత అభిప్రాయాలు, అంచనాలు మాత్రమే ! పత్రికా ప్రకటనలపై శేషన్ విధించిన ఆంక్షల వల్ల ప్రచారంలో ఎదురౌతున్న ఇబ్బందుల పట్ల సానుభూతితో మాత్రమే వారికా అవకాశం ఇవ్వబడింది. అవి జమీన్‌రైతు అంచనాలు, అభిప్రాయాలు కావు. పాఠకులు గమనించ వలసి !

సంపాదకుడు
జమీన్‌రైతు

పుణ్యక్షేత్రంగా పరిమంది ఎరిగిన పెంచలకోన ప్రస్తుతం స్మగ్లింగ్‌కు ప్రధాన స్థావరంగా విరాజిల్లుతూంది. అటవీశాఖ నిర్లక్ష్యం, పోలీసు అసమర్థత వల్ల ఎర్రచందనం స్మగ్లింగ్‌కు పట్టపగ్గా లేకుండా పోయాయి. విచ్చలవిడిగా ఎర్రచందనం స్మగ్లింగ్ జరుగుతుందని అధికారులందరికీ తెలిసినా, తమకేమీ పట్టనట్లు వ్యవహరించే విధంగా లంచాలిచ్చి మరిపిస్తున్నారు. ఇటీవల ఎర్రచందనపు దుంగలు వేసుకొని, దొంగచాటుగా వెళ్తున్న లారీ బురదలో కూరుకు పోయింది. స్మగ్లర్లు దాన్ని బయటకు లాగేందుకు అన్ని ప్రయత్నాలూ చేసి విఫలమయ్యారు. రెండురోజులుగా ఆ మార్గాన పయనిస్తూ కూడా ఇరుక్కున్న లారీని చూసి చూడనట్లు వెళ్లడం బట్టి అధికారులు ఎంత అవినీతిపరులై పోయారో కళ్లకు కట్టినట్లు కనబడుతోంది. స్మగ్లర్లు విసిగి వెళ్లిపోయిన తర్వాత, దాన్ని తాము పట్టుకొన్నట్లు వ్రాసుకొన్నారు అధికారులు. జిల్లా అధికారులు తగిన శ్రద్ధ వహించి, ప్రత్యేక నిఘా బృందాలను ఏర్పాటుచేస్తే గాని ఈ స్మగ్లింగ్‌కు అడ్డుకట్ట వేయటం సాధ్యం కాదు. పుణ్యక్షేత్రం పవిత్రత కాపాడడానికైనా ఎవరో ఒక జిల్లా అధికారి స్పందించక పోతాడా అన్న ఆశ రాపూరు మండల ప్రజల్లో మినుకు మినుకుమంటోంది.

### సినిమా ఫక్కీలో బస్సు దోపిడి

దొరబాబుల్లా బస్సులు ఎక్కడం, అదను చూసి దోచుకోవడం ఈ మధ్య పరిపాటై పోయింది: ప్రయాణీకుల్లో టిప్‌టాప్‌గా కూర్చొనే వారిలో దొరలెవరో, దొంగలెవరో గుర్తు

### జిల్లా వార్తలు

పట్టడమే, కష్టం, కావడం ల్ల ఈ సినిమా ఫక్కీ పిడీలు ఎక్కువయ్యాయి. 16 తేది గూడూరు నుంచి సైదాపురం మీదుగా, రాపూరు వెళ్లే బస్సును ఈ విధంగానే దోచుకున్నారు. 70 మంది ప్రయాణీకులతో గూడూరులో రాత్రి బస్సు బయలుదేరింది. 20 మంది ప్రయాణీకులు సైదాపురంలో దిగిపోయారు. సైదాపురం దాటాక ఇద్దరు యువకులు లేచి కత్తులు తీసుకొని డ్రైవర్, కండక్టర్ వద్దకు వెళ్లి బస్సును ఆపించారు. కండక్టర్ క్యాష్ బ్యాగులోని పదహారు వందల రూపాయలతో సహా ప్రయాణీకుల వద్ద 30 వేల రూపాయల విలువచేసే నగదు, బంగారు దోచుకొని జల్సాగా బస్సు దిగి వెళ్లిపోయారు.

### వానలకు రోడ్డు కొట్టుకెళ్లింది

ఘనత వహించిన రోడ్లు, భవనాల శాఖాధికారుల లీలలు గూర్చి ఎంత చెప్పుకున్నా తక్కువే అవుతుంది. వాన చినుకు రాలితే, కొట్టుకు పోగల రోడ్డును వేయడంలో తామెంత నిపుణులో నిరూపించారు వారు. రాపూరు పొదలకూరులరహదారి మధ్య దూరం 31 కి.మీలు. ఈ రోడ్డు పస్థితి మరీ అధ్వాన్నంగా వుండడంతో 10 కిలోమీటర్లు చేరల మిగతాదంతా తారు రోడ్డు వేశారు. ఏదో కొంతమేరకైనా తారు రోడ్డు పడిందని ప్రజలు సంతోషించారు. కాని ఆ సంతోషం మూడునాళ్ల ముచ్చటే అయింది. ఇటీవల పడిన వర్షాలకు వేసిన రోడ్డంతా కొట్టుకొని పోయింది. దీంతో గుంటా, మిట్టలతో సాగే రోడ్డులో ప్రయాణించే వారి తల ప్రాణం తోకకు వస్తున్నది. చేసిన పనికి ఎప్పుడో బిల్లుల జారీ కార్యక్రమం పూర్తయివుంటుంది. కాబట్టి కాంట్రాక్టర్లను ఎవరూ ఏమి చేయలేరు. ఎందరు నిందించినా రోడ్డు భవనాల శాఖ అధికారుల్లో చలనమే వుండదు.

# రాజకీయం వ్యాపారం కాదు - ధనముంటే జనం రాబోరు!

రాపూరు శాసనసభా నియోజకవర్గం నుంచి శ్రీ ఆనం రామనారాయణ రెడ్డి కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీ చేస్తున్నారు. రామనారాయణ రెడ్డి రాపూరుకు కొత్తకాదు; రాపూరూ



రామనారాయణ రెడ్డికి కొత్తకాదు. సాంప్రదాయంగా ఆనం కుటుంబపు రాజకీయ ఔన్నత్యానికి బాటలు పరిచే నియోజక వర్గం రాపూరు. జిల్లా రాజకీయాలను శాసించే పరిణామాలు ఎప్పుడూ రాపూరు లోనే జరుగుతుంటాయి. గల్గినవారు. అందుకే ఐదేళ్ల విరామం తర్వాత కూడా రాపూరు ఆయనకు బ్రహ్మరథం పడుతున్నది; హార్దికంగా స్వాగతిస్తున్నది.

రాజకీయం అంటే
వ్యాపారం కాదు;
కేవలం ధనం వుంటే
జనం ఎగబడిరారు;
ఈ నిజం తెలియని
ఈ వాస్తవం గ్రహించని
లోకాన్ని కళ్లు తెరచి
నేరుగా చూడలేని
అమాయకులు
అవివేకులు
రాపూరు ప్రజలను
వంచించను
మాయ చేయను
భ్రమలో పెట్టను
వస్తున్నారు.

రాహిత్యపు శాపానికి గురైన ప్రదేశం! ప్రతి వూరూ ఒక సమస్యల నిలయం; ప్రతి పల్లె ఒక కడగండ్ల కేంద్రం! రాయలసీమ నానుకొని, రాయలసీమ దుర్భర పరిస్థితులను తానూ పుణికి పుచ్చుకొని, ఏళ్లు



# రామనారాయణరెడ్డి సేవాభావమే రాపూరు అభివృద్ధికి రహదారి!

గడిచినా, తరాలు మారినా తలరాత మాత్రం మారని దుర్గతిలో వున్న రాపూరు పల్లె సీమలను ప్రగతితో భాసింప జేయాలంటె అల్లాంటిల్లాంటి ప్రతినిధి చాలడు.

ఎన్నికల్లో
ఓట్లేయించుకొని

కల్గిన ఆనం
రామనారాయణ తోనే
రాపూరు అభివృద్ధి
సులభ సాధ్యం

ఈ మంచి లక్షణాలు, ఈ సరైన అర్హతలున్న రామనారాయణ రెడ్డి సహజంగానే ప్రజల దృష్టి

రామనారాయణను
గెల్పించుకుందాం ;
వాటన్నింటినీ
ఒకటొకటిగా
పరిష్కరించుకొందాం;
ప్రభుత్వ నిధులు
తరలించుకవద్దాం ;
అధికారుల పెను నిద్దర

# ప్రజలతో మమేకం కాగలిగినవాడే ప్రతినిధి కావాలి!

అది చరిత్ర.

అందులోనూ రామ నారాయణ యువకుడు. తరగని



ఉత్సాహం కల్గినవాడు. మధ్య తరగతి నిరాడంబర జీవనానికి సంకేతం వంటివాడు. చదువు కున్నవాడు. జనం సమస్యలు అర్థం చేసుకో గల్గినవాడు. ప్రజలతో మమేకమై పనిచేయ

రాపూరు ఓటరు
రాజకీయ చైతన్యం
వారికి తెలియదు పాపం!
తెలుసుకో గల్గితే
ఆ పొరపాటు చేయరు.
వారి స్థానమేమిటో
వారి పొరపాటేమిటో
తెలియచెప్పడం
మన ధర్మం;
రామనారాయణరెడ్డికి
ఓట్లేయడం ద్వారానే
అది సాధ్యం

* * *

రాపూరు చాలా, చాలా వెనుకబడిన ప్రాంతం. అభివృద్ధి

మళ్ళా ఎన్నికల్లో గాని
కన్పడని వారు,



పలురకాల
స్వంత వ్యాపారాలలో
క్షణం తీరికలేనివారు,
ధనార్జనే ధ్యేయంగా
అందుకు ఈ పదవే
ఒక అవకాశంగా
వాడుకోవాలను కొనేవారు
ప్రజాప్రతినిధులైతే
ప్రజలకు మిగిలేది
ఓటెందుకు వేశామా
అన్న చింత మాత్రమే!
విద్య వినయం
విజ్ఞానం, వివేకం
ఆలోచన, అవగాహన
పలుకుబడి, సామర్థ్యం
సేవాసక్తి, శ్రద్ధ
అంకిత భావం

ఆకర్షించి, ప్రజాభిమానం పొందడం చూసి ఓర్వలేని వారెందరో పడవ క్రింద చేరి చిల్లు పెట్టాలని చూస్తున్నారు; ప్రజలను పెడదారి పట్టించాలని చూస్తున్నారు.

ఓటర్లారా!
బహుపరాక్!

కండ్లేరు ముంపు
గ్రామాల కడగండ్లు,
రైతుల ఈతిబాధలు
కరువు కాటకాల చిక్కులు



పూర్లకు వెళ్లనివ్వని డొంకలు
గొంతు తడపని బావులు
పైర్లు మాడ్చే చెరువులు
భవనాల్లు లేని బడులు
పంతుళ్లు లేని పాఠశాలలు
మందులు, డాక్టర్లుండని
ఆస్పత్రులు...
సమస్యలు చెప్పలేనన్ని

వదిలిద్దాం ;
మన బ్రతుకులు మనమే
బాగు చేసుకొందాం ;
ముందుకు రండి.
చేయూత ఇవ్వండి
రామనారాయణకు అఖండ
విజయం చేకూర్చండి.

**- వేమారెడ్డి రాజగోపాలరెడ్డి**

## ఎన్నికల ఇసిత్రాలు

-జయంపుకృష్ణ

| | |
|---|---|
| కాకా | మాటలగమ్మత్తు |
| ధూక | దొమ్మెట్లు |
| పొడవైన బాకా- | కటౌట్లు |
| గుంపు | రిజర్వ్ జెట్లు- |
| కంపు | వాంఛ |
| ఊరేగింపు- | ఆంక్ష |
| బంధనం | జెండా ఊంఛ- |
| చందనం | కులం |
| పాదాభివందనం- | మతం |
| పానం | కురుక్షేత్రం- |
| దానం | చిమ్ము |
| వాగ్దానం | రొమ్ము |
| వాదం | మెదడు ఉప్పు- |
| వివాదం | నవ్వు |
| భువి వివాదం- | ఏడ్పు |
| ఓటు | వదిలో పువ్వు- |
| నోటు | చూసేన |
| గాలివాటు- | [illegible] |
| చిత్తు | ఇ.సి.శేషన్- |
| ఎత్తు | |

## ప్రకాశరావు (20 వ పేజీ కొరవ)

నియోజకవర్గానికి ప్రగతి ; ఓటర్లందరికీ అభివృద్ధి!

గూడూరు ఓటర్లు చైతన్యవంతులు ; రాజకీయంగా రాష్ట్రానికి మార్గ దర్శకత్వం నెరపకల్గిన విజ్ఞులు. ఈ ఎన్నికల సమయంలో ప్రతి ఓటరూ ఇప్పుడు ఏది అవసరమో ఆలోచించాలి ; ఎక్కడినుండి ప్రమాదం పొంచుకొని వున్నదో గ్రహించాలి ; సరైన నిర్ణయం

తీసుకోవాలి!

నిజాయితీకి
పట్టం కట్టి
నీతికి అండగా
నిలబడాలంటె
మనమంతా ఇప్పుడు
కాంగ్రెస్‌కు ఓటేయాలి
ప్రకాశరావును గెల్పించాలి!

- ఎలసిరి గోపాలరెడ్డి

### ఏ నియోజకవర్గం చూసినా నువ్వా నేనా అన్నట్లున్నాయి పోటీలు!

# ఏ పార్టీకి వుంది గెలుపు పైన నమ్మకం?

జిల్లాలో ఎన్నికల వాతావరణం అంతా కుదురుకపడలేదు; కల్లోలం సద్దుమణగలేదు. పోలింగుకు చాలా వ్యవధి వుంది. కేవలం పుణ్యాన రోజులు భారంగా గడుస్తున్నాయి. ఇల్లిల్లు తిరిగి ప్రచారం చేసుకోవడం తప్ప, ఇంకేమి చేసినా ఎన్నికల నిబంధనలు అడ్డువస్తుండడంతో అభ్యర్థులకు, కార్యకర్తలకు కాలుచేయి ఆడడంలేదు. మామూలు పరిస్థితుల్లో అయితే జెండాలు కట్టడం, బ్యానర్లు వ్రేలాడదీయడం, కటౌట్లు అమర్చడం, మైకులతో హోరు మన్పించడం వంటి కార్యక్రమాలతో అందరూ బిజీగా వుండేవారు. రోజులు వారాలు ఇట్టే గడచి పోయేవి. అవేవీ లేకపోవడంతో ఏమి చేయాలో తోచడం లేదు. ఇల్లిల్లు తిరిగే ప్రచారానికి వాన పెద్ద అడ్డంకిగా వుంది. టౌన్లోను, పల్లెల్లో కూడా బురద, నీటి మడుగులు, చీదర చీదర! అయినా తప్పదు కదా? పంచలు పైకి కట్టి, ప్యాంట్లు ఎగబట్టి తిరిగేస్తున్నారు అభ్యర్థులు. కాళ్లు వాచిపోవడం తప్ప, తమ తిరుగుడుకు ఫలితం వుంటుందో లేదో అర్థమైతే కదా పాపం!

ఓటరు మనస్థితి అసలు బాధపడడం లేదు. ఒక్కొక్క ఎన్నిక జరిగేకొద్దీ ఓటరులో చైతన్యం పెరిగి పోతూంది. తనేమిటో, తన ఆలోచనేమిటో అసలు పొక్కకుండా, గుంభనంగా, గంభీరంగా వుండిపోవడం అలవాటైంది ఓటరుకు. ఏ అభ్యర్థి వచ్చినా నవ్వు ముఖంతోనే స్వాగతం; ఏ కార్యకర్త గట్టిగా అడిగినా మీకే నా ఓటనే సమాధానం; లోపలేముందో బయటకు చెప్పడు.

ఎన్నికల ఫలితాలు ఎట్లుంటా యన్న అంచనాకు, విశ్లేషణకు ఇది సరైన సమయం కాదు. ఇంకా చాలా వ్యవధి వుండడమే కాదు ఏ అభ్యర్థి

> జిల్లాలో అస్తవ్యస్తంగావున్న ఎన్నికలచిత్రం

తన ప్రచార, అంగ, అర్థబల సమీకరణల్లో ఒక కొలిక్కి రాకముందే అంతిమ ఫలితాలు అంచనా కట్టడం దుస్సాహసమన్పించు కొంటుంది. అయితే ఒక్కటి మాత్రం స్పష్టం. ఏ నియోజక వర్గంలోనూ ఏ పార్టీ లేక ఏ అభ్యర్థికి నల్లేరుపై నడక లేదు. అన్ని దగ్గర్లా నువ్వా నేనా అన్నట్లుంది పోటీ. ఎన్టీఆర్ గాలిలేదు, కాంగ్రెస్ పవనాలూ వీచడం లేదు. పార్టీల ప్రభావం కంటె, అభ్యర్థుల వ్యక్తిగత పలుకుబడి, సమర్థత, వనరుల సమీకరణ, ప్రచారం తీరు తదితరాలపైనే ఈసారి విజయావకాశాలు ఆధారపడి వుంటాయా అన్పిస్తూంది. అందువల్లే వాతావరణంలో గాలులు, ధూళులు కన్పించడం లేదను కోవలసి వస్తూంది; అందువల్లే ఏ పార్టీ కూడా గెలుపు పట్ల నమ్మకం పెంచుకోలేకపోతున్నది.

21 తేది ఎన్టీ రామారావు, 26తేది ప్రధాని శ్రీ పివి నరసింహారావు వచ్చివెళ్లి, కాని పరిస్థితి తేట పడదు. అంతవరకు ఏ అంచనా వేసినా, ఏ జోస్యం చెప్పినా దండగే!

జిల్లా కాంగ్రెస్‌లో విద్రోహ చర్యలు నిర్విఘ్నంగా, నిరాటంకంగా జరిగి పోతున్నాయి. మాగుంట సుబ్బరామిరెడ్డి గారు ఏమాత్రం తన మంకు పట్టు వీడలేదు. రాపూరు, సర్వేపల్లి, వెంకటగిరి, గూడూరు, కోవూరు, సూళ్లూరు పేటలలో ప్రధానంగా, ఆత్మకూరులో రేఖా మాత్రంగా కాంగ్రెస్ అభ్యర్థులను ఓడించే కృషిలో నిమగ్నులై వున్నారు. ప్రధాన మంత్రి స్వయంగా ఫోన్‌లో హెచ్చరించినా, ముఖ్యమంత్రి బ్రతిమ లాడినా, మైసూరారెడ్డి వంటి హితైషులు నచ్చ చెప్పజూసినా ఆయన ధోరణి ధోరణిగానే వుంది. ఏమాత్రం రాజీపడడం లేదు. ఆయా నియోజక వర్గాలలో కాంగ్రెస్ ప్రత్యర్థులకు మూటకొనుల నిండా డబ్బు సరఫరా చేయడం జరుగుతున్నది. ఎల్లసిరి శ్రీనివాసులు రెడ్డి, వేమారెడ్డి రామచంద్రారెడ్డి, కొమ్మి లక్ష్మయ్య నాయుడు వంటి వారు పబ్లిక్‌గా మాగుంట ఇంటికి వచ్చి మాట్లాడి వెళ్తున్నారు. వారి తరఫున మేనకూరు గోపాలకృష్ణా రెడ్డి విస్తృతంగా పనిచేస్తున్నారు. పూటుకూరు ఆదిమూర్తి వంటి అసంతృప్త జీవులను చేరదీసి, వెంకటగిరి, గూడూరు, రాపూరు హరిజనవాడ లలో కాంగ్రెస్ వ్యతిరేక ప్రచారం నిర్వహిస్తున్నారు. కరపత్రాలు, డబ్బు పంచుతున్నారు. గ్రామస్థాయి నాయకులను పిలిపించి, ప్రలోభపెట్టి, విద్రోహానికి ప్రమాణాలు చేయించు కుంటున్నారు. ధనం వరద వలె పారుతున్నది.

జనార్దనరెడ్డితో కనీసం కలసి మాట్లాడడానికి కూడా మాగుంట సుబ్బరామిరెడ్డి గారు ఇష్టపడడం లేదు. తమ స్వంత అభ్యర్థివున్న నెల్లూరు విషయంలోనూ వారు ఆయన్ను సహాయం అభ్యర్థించలేదు. కాని మాగుంట శ్రీనివాసులరెడ్డి మాత్రం



వరగలి సామ్రాజ్యంలో విప్లవ శంఖారావం పూరించిన వేమారెడ్డి మేనల్లుడు, వై. జానకి రామరెడ్డితో గూడూరు సభలో ఎస్. జనార్దనరెడ్డి. ఈ సాన్నిహిత్యం గూడూరు రాజకీయాలలో ఏ పరిణామాలకు దారితీస్తుంది

సత్యం జనార్దనరెడ్డితో సంబంధాలు కొనసాగిస్తున్నాడు.

తెలుగు దేశం పరిస్థితి చాలా మెరుగు. వారు తమ జిల్లా స్థాయి నాయకులను కాళ్లు పట్టుకునో, గడ్డాలు పట్టుకునో బ్రతిమలాడి అలుకలు మాన్పుకున్నారు. బీగా నారసింహారెడ్డి, నల్లపరెడ్డి చంద్రశేఖరరెడ్డి లిద్దరూ అలుక మాని ప్రచార రథాలు అధిరోహించారు.

సర్వేపల్లి, ఆత్మకూరు, కావలి, అల్లూరు వంటి స్థానాలలో విద్రోహం వున్న ప్పటికీ అది ఇదివరకటంతటి తీవ్రంగా లేదు.

కాంగ్రెస్ వాదులు తమ ఇళ్లకు తాము కన్నాలు వేసుకుంటూ పోతుంటే, తెలుగుదేశం సందుచూచుకొని ఆ కంతల గుండానే లోపలకు దూరిపోతున్నదా అన్పిస్తున్నది పరిస్థితి చూస్తుంటే! తాము కూర్చున్న కొమ్మను తామే ...

కొరవ 9 పేజీలో

# ఇంతటి మిత్రద్రోహానికి ఎందుకు పాల్పడినట్లు?

జనార్దన రెడ్డితో, వేమారెడ్డి రామచంద్రా రెడ్డి గారి స్నేహ సంబంధాలు శాశ్వతంగా తెగిపోయాయి. ఇరవయ్యేళ్ల పాటు అజన్మ స్నేహితుల వలె తిరిగిన వీరిద్దరూ, ఇరవై క్షణాల్లో ఆగర్భ శత్రువులుగా మారిపోయారు.



నెల్లూరు టౌన్‌లోని ఒక మురికివాడలో కోరున కురిసే వానమా లెక్క, చేయకుండా నడిచి తిరుగుతూ ఓట్ల భిక్ష అర్థిస్తున్న కాంగ్రెస్ అభ్యర్థి పి.వి. ప్రసన్న రెడ్డి

ఆయన్ను ఓడించడానికి ఆయన ఈయన్ను చులకన చేయడానికి ఆయన కంకణ ధారులైనారు. జిల్లా రాజకీయాలను భవిష్యత్‌లో సంక్షుభితం చేయనున్న ఒక విష పరిణామానికి శాస్త్రోక్తంగా అంకురార్పణ జరిగింది.

రాజకీయాల్లో హీరోలు విలన్లు కావడం, విలన్లు హీరోలుగా మారడం విచిత్రమేమీ కాదు. కాని జనార్దన రెడ్డి, వేమారెడ్డిల స్నేహం రాజకీయా తీతమైనదనే అభిప్రాయం వుంటుంది. జనార్దన రెడ్డి పదవిలో వున్నప్పటి కంటే లేనప్పుడే రామచంద్రా రెడ్డి అధిక సాన్నిహిత్యంతో మెలిగే వాడు. తెలుగుదేశం ఏడేళ్ల చిత్ర హింసాయుత పరిపాలనలో సైతం జనార్దన రెడ్డిని వదలి పెట్టలేదు. ఆయన ముఖ్యమంత్రి అయినప్పుడు ఏ పదవీ కోరలేదు. అటువంటి వాడు ఇప్పుడు వున్నట్లుండి ఎందుకు తిరుగుబాటు చేసినట్లు? ఎందుకు మిత్ర ద్రోహానికి పాల్పడినట్లు? ఎందుకు కోరి తగవు తెచ్చుకొన్నట్లు? దీనికి కారణమేమిటి? రామచంద్రా రెడ్డి గారు పదే పదే చెప్పే పట్రా ప్రకాశ రావు టికెట్ మాత్రం కాదు; అది కేవలం ఒక సాకు మాత్రమే.

దీని వెనుక చాలా లోతైన రాజకీయ ఆలోచన వుండి వుండాలి; పథక రచన జరిగి వుండాలి. ఆ ఆలోచన ఏమిటి? ఆ పథకం రచించిందెవరు? దాని వెనుక ఎవరెవరున్నారన్నది చిదంబర రహస్యం. ఇప్పటికిప్పుడు ఈ అసెంబ్లీ ఎన్నికల ప్రకటన తర్వాత జరిగిన పరిణామం కూడా కాదిది. చాలా కాలం నుంచే దీనికి ప్రయత్నం జరుగుతుండి వుండాలి.

వెంకటగిరిలో శ్రీమతి నేదురుమల్లి రాజ్యలక్ష్మి ప్రత్యక్ష రాజకీయ జోక్యం గూడూరుకు ప్రసరించడం రామచంద్రా రెడ్డికి ఇష్టం లేదు. ఇది వరకే ఆయనా విషయం స్పష్టంగా వ్యక్తం చేసేవాడు కూడా! కాని ఆమెను నివారించడం ఆయన కలివి కాలేదు. అది మనసులో

> వేమారెడ్డి రామచంద్రారెడ్డి తిరుగుబాటుకు కారణమేమిటో ఎంతకూ బోధపడడంలేదు; జనంలో వెల్లి పడడం తప్ప సాధించ గల్గిందీ కన్పించడం లేదు!

పెట్టుకొని, ఇప్పుడు బయట పడ్డారా? లేక ఢిల్లీలో జనార్దన రెడ్డి పలుకుబడి తగ్గిపోయిందనే వుద్దేశ్యంతో, రాజకీయంగా పైకెదిగి వస్తున్న మాగుంట సుబ్బరామ రెడ్డి వంటి వారు భవిష్య నాయకులుగా ఎదిగే అవకాశం వుందనే అభిప్రాయంతో అటు దృష్టి మళ్ళించాడా? లేక ముఖ్యమంత్రి విజయ భాస్కర రెడ్డి దగ్గర జనార్దన రెడ్డిని జిల్లాలోనే రాజకీయంగా హతం చేసే ఒప్పందం ఏదైనా కుదిరిందా? ఈ మూడింటిలో ఒకటి లేదా మూడూ కలసి రామచంద్రా రెడ్డిని ఈ నిర్ణయానికి పురికొల్పి వుండవచ్చు.

మాగుంట సుబ్బరామ రెడ్డి, ముఖ్యమంత్రి కలసి జనార్దన రెడ్డిని దెబ్బ తీయడానికి ప్రోత్సాహం ఇవ్వడం పెద్ద నేరం కాదు; అది వారి రాజకీయ చాణక్యంలో ఒక భాగం. కాని రామచంద్రా రెడ్డి వారి చేతిలో ఒక పావుగా మసలు కోవడానికి సిద్ధ పడడమే విచార పడవలసిన విషయం.

కొరవ 9 పేజీలో

# కొత్తవారికి అవకాశం ఇచ్చి చూడండి – పిల్చినప్పుడల్లా పలికే నేస్తాన్ని తెచ్చుకోండి!

కొత్తనీరు వస్తుంటే
పాతనీరు పోతుండాలి
అది లోకనియమం ;
ప్రకృతి సహజం !
నీళ్లయినా నిల్వవుంటే
పాచి పడుతుంది ;
రాజకీయం సంగతి
వేరే చెప్పాలా ?
ఎప్పుడూ ఒకరి పెత్తనం,
ఒక కుటుంబపాలన
ప్రజలకు క్షేమం కాదు.

నియోజకవర్గ ప్రజానీకంతో కలిమిడిగా తిరుగుతూ, కలసి వుంటున్నవారే.

వుంటారో లేరో తెలియదు. వచ్చిన వారెవరో వారికి తెలియదు. తెలిసినా, తమ పదవిని, తమ

## కోవూరు నియోజకవర్గ ఓటర్లు కొత్తదనం కోరుకుంటున్నారు!

దేవకుమార్‌రెడ్డికి గ్రామాలు తెలుసు

సమయాన్ని తమ స్వంత ప్రాంతాల వారికి, సమస్యకు



## ఎక్కడినుంచో వచ్చినవారితో ఎన్నో పేచీలు..





కేటాయించడం వారికి తప్పదు. గెల్పించిన ఓటర్లు, నియోజకవర్గం రెండో ప్రాధాన్యత తప్ప మొదటి స్థానం సంపాదించలేవు. అనుభవించాం కదా - ఆ పేచీలన్నీ.

అదే దేవకుమార్ రెడ్డి అయితే ఏ ఇబ్బంది వుండదు. ఆయనకిదే స్వంత నియోజకవర్గం ; స్వంత వూరూ ఇక్కడే ; స్వంత

అయోధ్య రచ్చ,
అస్సాం కార్చిచ్చు,
శ్రీలంక భూతం
బొంబాయి అల్లర్ల
దావానలం
వంటి ప్రమాదాలనుంచి
నేర్పుగా దేశాన్ని
రక్షించింది
కాంగ్రెస్ పార్టీ ;
పరిశ్రమలు పెంచింది,
కరెంట్ ఇచ్చింది,

పరిష్కారమౌతాయి. ఐదేళ్ల కాంగ్రెస్ పాలనలో మలిదేవి డ్రైను రిపేరు, పైడేరు పూడిక తీతల వల్ల ఎటువంటి వెల్లువకు గురై వుండేవి ? ఎంత నష్టపోయి వుండేవారం ?

కాంగ్రెస్ అధికారంలో వుండబట్టే కదా - మనకీ లాభాలన్నీ సిద్ధించాయి. అందుకే
కాంగ్రెస్‌కు మరో
అవకాశమిద్దాం ;
కొత్తతరానికి

## ఇక్కడే వుండే యువకుడైతే అందరికీ మేలు కదా?

మార్పన్నది లేకుంటే
ప్రజాస్వామ్యంలోనూ
నియంతృత్వం
చోటు చేసుకుంటుంది ;
ప్రజా ప్రతినిధి
ప్రజలకు దూరమౌతాడు !
అప్పుడప్పుడూ
కొత్తవారికి అవకాశం
ఇచ్చిచూడడం
అన్ని విధాలా
శ్రేయస్కరం !
ఆ నిర్ణయం మనం
ఇప్పుడే ఎందుకు
తీసుకోకూడదు ?
ఆ ప్రయోగం మనం
ఇప్పుడే ఎందుకు
చేసి చూడకూడదు ?

కోవూరు నియోజకవర్గం శాసనసభ ఎన్నికల్లో శ్రీ దేవూరు దేవకుమార్ రెడ్డి కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీ చేస్తున్నారు.

దేవకుమార్ రెడ్డి కోవూరు ఓటర్లకు, కోవూరు పల్లెలకు పాతవారే. పదేళ్లకు పైనుంచి నియోజకవర్గ గ్రామాలలో,

గ్రామాల సమస్యలు తెలుసు
కష్టించి పనిచేయడం
ఎంతో బాగా తెలుసు
కల్లా కపటం
తెలియని మనసు!
ఉత్సాహంగా వ్యవహరించే
వయస్సు వుంది ;
ఉద్యమాలు నిర్వహించే
వాకచక్యం వుంది ;
పోరాడైనా సాధించే
సాహసం వుంది ;
ఎమ్మెల్యేగా గెల్పిస్తే
అందుబాటులో వుంటాడు ;
అందర్నీ కలుపుక పోతాడు ;
అభివృద్ధి సాధిస్తాడు ;
నియోజక వర్గం
ప్రతిష్ఠ పెంచుతాడు !

ఎక్కడెక్కడో వుండేవారు కోవూరుకు వలస రావడం, గెల్చిన తర్వాత ఎక్కడి నుంచి వచ్చారో అక్కడికే వెళ్లిపోవడం బాగా అలవాటై పోయివుంది. బయటినుంచి వచ్చిన వారితో ఎన్నో బాధలు ! వారిని వెతుక్కుంటూ వెళ్లాలి ; వెళ్తే

మనుషులూ ఇక్కడివారే. పూర్తి శక్తిని, పూర్తి సమయాన్ని వెచ్చించగలడు ; కోవూరు అభివృద్ధికి అహరహం కృషి చేయగల్గుతాడు.

అభ్యర్థినే కాదు - పార్టీని



పరిగణించాలి. కాంగ్రెస్ పార్టీ దేశానికి ఎంత సేవ చేసిందో, దేశానికి ఇప్పుడు కాంగ్రెస్ పార్టీ అవసరం ఎంతవుందో ప్రత్యేకంగా చెప్ప పనిలేదు.

బంగారు కుదువపెట్టి
తల తాకట్టుపెట్టి
విదేశీ అప్పులు
తీర్చాల్సిన దుర్గతినుంచి
దేశాన్ని తప్పించింది
కాంగ్రెస్ పార్టీ ;
కాశ్మీర్ చిచ్చు,

తన రోడ్లు వేసింది
రైతు క్షేమం కాంక్షించింది
21 శతాబ్దం వైపు
మనల్నందర్నీ
నడిపిస్తున్నది
కాంగ్రెస్ పార్టీ !
ఆర్థిక సంస్కరణలు
మధ్యలో ఆగితే
దివాలాయే గతి ;
కడుతున్న ప్రాజెక్టులు
నిధులు లేక నిలిస్తే
కాటకాలే గతి ;
విద్యుత్ పథకాలు
కొనసాగించకుంటే
కారు చీకటే గతి ;
ఇవన్నీ చేయగల్గింది
ఒక్క కాంగ్రెస్ పార్టీయే !

రాష్ట్రమంతా కాంగ్రెస్ గెల్చినప్పుడు కోవూరు మాత్రం ఎందుకు మినహాయింపు కావాలి ? ప్రభుత్వంలో వున్న పార్టీ అభ్యర్థి మన ప్రతినిధి అయితే మన గ్రామాల సమస్యలు సత్వరం రైతాంగం ఎంత లాభపడింది ? అవి పాత దుర్గతిలో వుండి వుంటే అప్పటి వానలకు మన పొలాలు



ఛాన్సు ఇద్దాం ;
మంచి నేస్తాన్ని
తెచ్చుకుందాం ;
దేవకుమార రెడ్డిని
గెల్పించుకొందాం !

- డి. రమాధరరెడ్డి

# కళ్ళుతెరవకుంటే కొంపగుల్లే!

నెరుక్కోవడానికి చూపుతున్న శ్రద్ధ వారికి ఇతర విషయాలపై వుండటంలేదు. ఇదిట్లే కొనసాగితే ఫలితాలు ఎట్లా వుంటాయో వూహించడం కష్టంకాదు. అందరూ కలసి కళ్లు తెరచి, నిజం గ్రహించి ప్రవర్తించ కుంటే కాంగ్రెస్ కొంపగుల్ల కావడం ఖాయమనిపిస్తున్నది.

పోలింగ్‌కు ఇంకా రెండు వారాల వ్యవధి వున్నది. ఇప్పటికి మించిపోయింది లేదు. కాంగ్రెస్ నాయకులు కలమేలు కొనేందుకు ఇంకా సమయం! అవకాశం మిగిలే వున్నాయి.

## ఎగతాళిగా మొదలై పోరాటంగా మారిందే!

నెల్లూరు నియోజక వర్గంలో పరిస్థితి రోజు రోజుకు జటిల మౌతున్నది. శ్రీ ఏ.వి. ప్రసన్న రెడ్డికి కాంగ్రెస్ టికెట్ వచ్చిన రోజు, తెలుగుదేశం రమేష్ రెడ్డిని ఎదుర్కోవడం ఆడుతూ పాడుతూ జరిగి పోతుందని భావించారు. వ్యాపార రీత్యా గాని, రాజకీయ మోజుతో గాని, ఇంత కాలం పంచిన చందాల డబ్బు వల్ల కాని మాగుంట ప్రతినిధిగా ప్రసన్న తన విజయం నిర్ణయమై పోయిందన్న వాతావరణంలో ప్రచారాని కుపక్రమించారు. కాని రోజులు గడిచే కొద్దీ ఆ పరిస్థితి నిలవడం లేదు. ఎగతాళిగా మొదలైంది కాస్త, పోరాటంగా మారింది. రమేష్ రెడ్డి నిదానంగానైనా పుంజు కొంటున్నాడు. అందరూ వూహించినట్లు అతనికి కార్యకర్తల కొరత ఏర్పడలేదు.

> ఎన్నికల చిత్రం
>
> (7వ పేజీ కొరవ)

పైపెచ్చు రెండుసార్లు ఓడిపోయాడన్న సానుభూతి పెరుగుతూంది.

అయితే ప్రసన్న వైపు నుంచి జరుగుతున్నంత పకడ్బందీగా రమేష్ ప్రచారం లేదు. వనరుల కొరత ఎదురౌతున్నట్లుంది. వనరులు పుష్కలంగా వున్నా ప్రసన్న ప్రచారం సాఫీగా జరగడం లేదు. జెకె రెడ్డి, కెవి సుబ్బారెడ్డిల ఇంటి పోరు; జెకె పై

నెల్లూరు కాంగ్రెస్‌కు బలమైన స్థానం. మధ్య తరగతి ఓటర్ల మనోభిప్రాయం పై ఫలితం ఆధార పడివుంటుంది. మాగుంట కుటుంబం పట్ల వారిలో సదభిప్రాయం వున్నదా లేక సంశయాత్మకత వున్నదా అన్నది తేలితే ఫలితం వూహించవచ్చు. మధ్య తరగతికి అందుబాటైన వ్యక్తిగా రమేష్ రెడ్డి గుర్తింపు పొందితే మాత్రం ప్రమాదమే.

ఏది ఏమైనా పరిస్థితి వూహించినంత సులువుగా లేదు. ప్రసన్న ఇంకా బాగా కష్టపడక తప్పదు.

### చంద్రమోహన్ పై మోజు-సివి సేవకు కృతజ్ఞత!

సర్వేపల్లిలోనూ పరిస్థితి క్లిష్టంగా వుంది. ఎవరి వూహకూ అందడం లేదు. సివి శేషారెడ్డి ఈ ఐదేళ్ళలో ఎమ్మెల్యేగా చేసిన సేవ, సాధించిన పనులు, పథకాలు చాలా పాదయాత్రలు ఆయనకు వుపకరిస్తున్నాయి. అయితే ప్రచారం తీరులో కొంత ఆత్మవిశ్వాసం ఎక్కువౌ తున్నదా అన్పిస్తుంది. శేషారెడ్డి మాత్రం వెనుక, ముందు చూడకుండా పూర్తి నమ్మకంతో ఇల్లిల్లు తిరిగి ఓట్లభ్యర్థిస్తున్నారు.

జెకె రెడ్డి, మాగుంట సుబ్బరామ రెడ్డి ద్వయం శేషారెడ్డిని ప్రత్యక్షంగానే పొడుస్తున్నది. ఈ నష్టం పూడ్చుకోవడానికి తెలుగుదేశం నుంచి తిక్కవరపు రామానుజాలు రెడ్డి వంటి వారు సహకరిస్తున్నారు.

ఇందుకూరుపేట ఫిర్కాలో తెలుగుదేశం, ముత్తుకూరు ఫిర్కాలో కాంగ్రెస్, వెంకటా చలం ప్రాంతంలో చెరి సగంగా వుంది పరిస్థితి. గ్రామ నాయకులను ఆకర్షించి, అనుకూలంగా మల్చు కోవడానికి ఇంకా సమయం మిగిలే వుంది. కాబట్టి, పోలింగ్ నాటికి పరిస్థితి ఎట్లా మారుతుందో చెప్పలేము. ఇప్పటికి మొగ్గు సివి వైపే వుంది!

## వేమారెడ్డి

(7వపేజీ కొరవ)

నిజంగా పట్రా ప్రకాశ రావును తప్పించి, తన అభ్యర్థిగా ఓడూరు రామచంద్రయ్యకు టిక్కెట్ ఇప్పించ దలచివుంటే జనార్ధన రెడ్డితో ఆ విషయం సీరియస్‌గా చర్చించి వుండేవాడు. మాగుంట వారి జాబితాలో భాగంగా రామచంద్రయ్య చేత నామినేషన్ వేయించి, ఆ తర్వాత రెండు రోజులకు జనార్ధన రెడ్డిని కలిస్తే ఆయనెట్లా ఒప్పుకొంటాడు మార్పుకు? ఏ నాయకుడికి గిట్టని ధోరణి కదా అది! అప్పటికి జనార్ధన రెడ్డి రామచంద్ర రావును పిలిపించి, నీకు మరొకసారి అవకాశం ఇస్తానని చెప్పడం అతను సరేననడం జరిగింది. అంతటితో వివాదం సమసి పోయినట్లే భావించి వేమారెడ్డి తిరుపతికి వెళ్లడం, పట్రా ప్రకాశ రావు చేత నామినేషన్ వేయించమని తన కుమారుడ్ని పురమాయించడమూ జరిగాయి.

ఆ తర్వాత రెండు రోజులకు, అదీ మేగోరెతో కలసి ఢిల్లీ వెళ్లిన తర్వాత వేమారెడ్డిలో మార్పు వచ్చింది. తాను వెంకటగిరిలో పోటీ చేస్తానన్న ప్రకటన అప్పటిదే!

ఒకసారి ఆ నిర్ణయానికి వచ్చిన తరువాత రామచంద్రా రెడ్డి మళ్ళీ వెనుదిరిగి చూడలేదు. ఎందరెన్ని విధాల చెప్పినా విన్పించుకోలేదు. జనార్ధన రెడ్డి స్వయంగా వెళ్ళి బ్రతిమలాడినా మనసు మార్చుకోలేదు. దీన్నిబట్టే - ఈ విద్రోహానికి గూడూరు టికెట్ కేవలం సాకుఅని, అంతకు మించిన లోతైన ఆలోచన ఏదో వున్నదని భావించ వలసి వస్తున్నది. వెంకటగిరిలో పోటీ ద్వారా జనార్ధన రెడ్డి మెడ పై కత్తి పెట్టి పట్రాను బలి చేస్తే కత్తి తీస్తా నన్నట్లు దబాయిస్తే - ఏ రాజకీయ వాది అంగీకరిస్తాడు? అది పిరికితనం అన్పించు కొంటుంది కదా!

ఇంత చేసి, రామచంద్రా రెడ్డి సాధించ లేదేమిటి! మాకేమీ కన్పడడం లేదు. ఆయన [illegible]ంత కుటుంబంలోనే [illegible] అన్యాయమన్న [illegible]

అందువల్లే తమ కుటుంబం ప్రతిష్టకు ఇంత కాలం సహకరించిన జనార్ధన రెడ్డిని, తమకు విధేయుడుగా వుండిన ప్రకాశ రావును వదలి పెట్టలేక ఆయన కుటుంబంలోని ముఖ్య సభ్యుడైన శ్రీ వై. జానకి రామిరెడ్డి విబేధించి బయటకు వచ్చేశాడు. 16 తేది గూడూరులో జరిగిన పట్రా ప్రకాశ రావు ప్రచార సభలో పాల్గొన్నాడు. మరొక సభ్యుడు శ్రీ వేమారెడ్డి వెంకట కృష్ణారెడ్డి 12 తేది ఉదయమే వాకాడులో జనార్ధన రెడ్డిని కలసి వచ్చాడు. అయితే ఆయనింకా ఏ నిర్ణయం తీసుకోలేదు. జనార్ధన రెడ్డితోనూ వివరంగా మాట్లాడ లేదు. కుటుంబ ప్రతిష్ట ఒక వైపు, మిత్ర ద్రోహాలన్పించు కోవాల్సి వస్తుందనే భయం ఇంకొక వైపు వెంకట కృష్ణారెడ్డిని సంకటంలో పెడుతు న్నట్లున్నాయి.

వెంకటగిరిలో కూడా రామచంద్రా రెడ్డికి ప్రతికూలత తప్ప, అనుకూలత కన్పడడం లేదు. జనార్ధన రెడ్డి ఓటమికి కారణమయ్యేంతటి ఓట్ల సంగతి దేముడెరుగు - కనీసం బిఎస్‌పి అభ్యర్థితో సమంగానైనా ఓట్లు తెచ్చుకో గలడా అనే సందేహం వుంది.

ఇంత కాలం గూడూరు డివిజన్‌లో రామచంద్రా రెడ్డి గారు పెద్ద రాజకీయ శక్తిగా పరిగణింప బడేవారు. అటు గూడూరు, అటు వెంకటగిరిలలో అప్పటి పరిస్థితి గమనిస్తే - ఆయన కేవలం కాగితం పులిగా మిగిలి పోతాడా అనే అనుమానం కల్గుతూంది. ప్రజలలో చులకన కావడం, ఇతర జిల్లా, రాష్ట్ర నాయకుల వద్ద హేళనకు గురి కావడం తప్ప ఈ తిరుగుబాటుతో రామచంద్రా రెడ్డి గారు సాధించేదేమీ లేదు. రాజకీయాలలో ఆత్మహత్యలు తప్ప, హత్యలు వుండవంటారు. ఆయనిప్పుడు చేజేతులా ఆత్మాహుతి చేసుకుంటున్నాడు. కాలం కలసి రానప్పుడు [illegible] ఆలోచనలే [illegible]!



చిల్లకూరుమండలం నాంచారం పేటలో తుఫాన్ సమయంలో ఒక గదిలో పెట్టి, తాళంవేసి మర్చిపోవడంతో ఊపిరాడక గిలగిల కొట్టుకుని చనిపోయిన మూగజీవాల కళేబరాల గుట్ట.

# కాంగ్రెస్‌వాదులు కన్నాలు వేస్తుంటే తెలుగుదేశం తన్నుకపోతున్నది!

సుబ్బారెడ్డిల ఇంటి పోరు; జెకె పై పేదల కాలనీలలో వ్యక్తమౌతున్న వ్యతిరేకత, డబ్బు దండు దండుక పోవడానికి తప్ప, చిత్త శుద్ధితో పనిచేయాలనే సంకల్పం లేకుండా చుట్టూ మూగుతున్న కార్యకర్తల గోల ఇంకొక ప్రక్క ప్రసన్న ప్రచారానికి చికాకు కల్గిస్తున్నాయి. ఎక్కడికి పోయినా ఆయనకు ఎదురౌతుంటే ప్రశ్న ఒక్కటే - డబ్బున్న జెకెను గెల్పిస్తే మాకు అందుబాటులో లేకుండా పోయాడు; మీరు మాత్రం [illegible]! [illegible] రెడ్డి బాగా వుపయోగ పెట్టుకుంటున్నాడు.

గ్రామాలలో ఓటర్లను మొగమాట పెడుతున్నాయి. అంత కష్టపడి పని చేసిన వాడి పట్ల కృతజ్ఞత చూపకపోతే ఎట్లా అని మధన పడుతున్నారు. కాని అదే సమయంలో తెలుగుదేశం

> తస్మాత్ జాగ్రత్త!

చంద్రమోహన్ రెడ్డి పై కొత్త మోజు వుంది. యువకుడు కావడం, మేనమామ నుంచి పుణికి పుచ్చుకున్న నైపుణ్యంతో మెత్తగా, మెల్లగా మాట్లాడడం, పారాయి ఉద్యమ

### రాపూరు వన్‌వే ట్రాఫికేనా?

రాపూరులో [illegible]ం రామనారాయణ రెడ్డికి [illegible]ద్ధ అవరోధాలు ఎదురు కావడం లేదు. తెలుగుదేశం ఎల్లసిరి శ్రీనివాసులు రెడ్డి నియోజక వర్గానికి కొత్త. రామనారాయణ తోటి చాలా మంది తెలుగుదేశం వాదులు కాంగ్రెస్‌కు వచ్చేసి వున్నారు కాబట్టి ఆ పార్టీకి కొన్ని గ్రామాలలో మనిషే దొరకడం లేదు. ఎల్లసిరి పూర్లకు దారులు, పూర్లలో కార్యకర్తలను [illegible]

కొరవ 11 పేజీలో

# నెల్లూరు బుచ్చెట్లు విశ్లేషకుడు

## ప్రధానమంత్రి- డిసిసి నిర్వహణ?

ప్రధాన మంత్రి శ్రీ పి.వి. నరసింహా రావు 26 తేది మధ్యాహ్నం నెల్లూరు వస్తారు. భోజనానంతరం స్థానికులతో మాట్లాడుతారు. 3 గంటలకు బహిరంగసభ. తర్వాత మద్రాసు.

ప్రధాన మంత్రి కార్యక్రమ నిర్వహణ మొత్తం జనార్దన రెడ్డి అధ్వర్యంలో డిసిసి అధ్యక్షుడు శ్రీ ఆనం సంజీవ రెడ్డి చూసేట్లున్నారు. మరెవ్వరికీ అవకాశం ఇవ్వదల్చడం లేదు. ఆయన పట్టుదల నెరవేరుతుందనే ఆశిద్దాం!

## వాజ్‌పాయ్

లోకసభలో ప్రతిపక్ష నాయకుడు, బిజెపి జాతీయ నాయకుడు అటల్ బిహారి వాజ్‌పాయ్ ఎన్నికల ప్రచార సభల్లో పాల్గొనేందుకు 19 తేది (శనివారం) జిల్లాకు వస్తున్నారు. ఉదయం ఆత్మకూరు, సాయంత్రం బుచ్చిరెడ్డిపాళెం, రాత్రి నెల్లూరులో బహిరంగ సభల్లో మాట్లాడుతారు. పార్టీ జాతీయ కార్యదర్శి ఎం.వెంకయ్య నాయుడు ఆయన వెంట వుంటారు.

## ఎన్టీఆర్ పర్యటన

తెలుగుదేశం పార్టీ సర్వాధినేత ఎన్టీ రామారావు 21, 22 తేదీల్లో ఎన్నికల ప్రచార సభల్లో పాల్గొనేందుకు జిల్లాకు వస్తున్నారు. 21 తేది సాయంత్రం కావలిలో తొలి; సభ. జాతీయ రహదారి మీదుగా కోవూరు చేరి, అటునుండి రాత్రి నెల్లూరు బహిరంగ సభలో మాట్లాడి ఇక్కడే బస చేస్తారు. 22 తేది వుదయం గూడూరు వెళ్లి అక్కడి నుండి రాపూరు వెళ్తారు. తర్వాత కడప జిల్లా రాజంపేట వైపు సాగిపోతాడాయన. తెలుగుతమ్ముళ్లు ఈ అన్న పర్యటనపై చాలా ఆశలు పెట్టుకొని వున్నారు.

## జయప్రద

తెలుగుదేశం ప్రచారంచేసే వారి లిస్టులో ఈసారి గ్లామర్ తార జయప్రద కొత్తగా వచ్చి చేరింది. స్థానిక నాయకులు అందించిన స్లిప్పుల ఆధారంగా జిల్లాలో అవాకులు, చెవాకులు ప్రేలిపోయింది. సూళ్లూరుపేట, వెంకటగిరి, పొదలకూరు, రాపూరు, కావలి, కలిగిరి, జలదంకిలలో తెలుగు తమ్ముళ్ల తరఫున ప్రచారం చేసింది. సినిమా స్టార్లను చూడడానికైతే ఎగబడ్తారుకాని, వారి మోజులో ఓటేసేంత అమాయకులా నెల్లూరు జిల్లా ప్రజలు

## జిల్లా జడ్జి బదలీ

జిల్లా జడ్జి ఇ. ఇస్మాయిల్ బదలీ అయ్యారు. ఆయన స్థానంలో వరంగల్ జిల్లా లేబర్ కోర్టులో జడ్జి అప్పారావు ఇక్కడ నియమింప బడ్డారు. తనను హైదరాబాద్‌కు బదలీ చేయమని జిల్లా జడ్జి హైకోర్టుకు పెట్టుకున్న అభ్యర్థన మేరకే ఈ బదలీ జరిగిందట. పుర్దూ భాషాభిమానియైన ఇస్మాయిల్ 26 నెలలు నెల్లూరులో పనిచేశారు.

## మాగుంట స్టేట్‌మెంట్

జిల్లాలో 11 మంది కాంగ్రెస్ అభ్యర్థులను గెల్పించ వలసిందిగా ఓటర్లను కోరుతూ శ్రీ మాగుంట సుబ్బరామ రెడ్డి గారు ఒక పత్రికా ప్రకటన విడుదల చేశారు. జనం కళ్ల నీళ్లు తుడవడానికి ఇచ్చిన ప్రకటనే ఇది. తిరుగుబాటు అభ్యర్థులను, తెలుగుదేశం అభ్యర్థులను దత్తత తీసుకొని డబ్బు సంచులందిస్తూ కాంగ్రెస్‌ను గెల్పించమని ప్రకటిస్తే జనం నమ్ముతారా?

## 'డేగా' పదవి

ఆత్మకూరు, సర్వేపల్లి సీట్లను ఆశించి భంగపడి అలకపాన్పు ఎక్కివున్న డేగా నారసింహారెడ్డిని ఆ పార్టీ అధిష్టానవర్గం జిల్లా ఎన్నికల కమిటీ కన్వీనర్ అనే నామమాత్రపు పదవితో బుజ్జగించింది. ఎన్నికల వరకే ఈ జిల్లా హోదా; ఎన్నికలయ్యాక మరో కొత్త పదవి ఇస్తారట. 'డేగా' కూడా మరీ ఎక్కువ అలిగితే మొదటికే మోసమని ఇచ్చిన పదవితో సంతృప్తి పడినట్లుంది.

## నెల్లూరు బజారు

| | |
|---|---|
| మొలగొలుకులు | 9674-4,300/- |
| | 9672-4,100/- |
| సున్నాలు | 3,900/- |
| బియ్యం బస్తా | 600/- |

## అల్లూరులో విష్ణుకు మెజారిటీ ఎంత?

అల్లూరులో శ్రీ కాటంరెడ్డి విష్ణువర్థన్ రెడ్డికి మెజారిటీ ఎంత అన్నదే ప్రశ్న తప్ప, గెలుపులో సందేహం లేదు. అనారోగ్యం వల్ల ప్రచారం చేయ లేకపోతున్నా, స్వంతమేనమామ కుటుంబ కక్షలతో బిజెపి అభ్యర్థిగా రంగంలోకి దిగి ఓటమి శపథం బూనివున్నా విష్ణు విజయాన్ని ఆటంక పరచడం లేదు.

తెలుగుదేశం కాకుండా సిపిఐ ఇక్కడ రంగంలో వుండడం విష్ణు అదృష్టం. జక్కా వెంకయ్య గారికి ఏ రైతు కూడా మనస్ఫూర్తిగా ఓటు వేయలేకున్నారు.

## యానాదిరెడ్డి గారు ఏమి చేస్తారో!

కావలిలో కాంగ్రెస్ అభ్యర్థి శ్రీ కలికి యానాది రెడ్డి గారు కష్టాల్లో పడి వున్నారు. తెలుగుదేశం అభ్యర్థి శ్రీ వంటేరు వేణుగోపాల రెడ్డి పట్ల కొత్త మోజు ఓటర్లను, ముఖ్యంగా రెడ్డి కులస్తులను బాగా ఆకర్షిస్తుంది. కాంగ్రెస్ వాదులైన కొందరు వంటి వారూ పచ్చ జెండా చేత పట్టారు.

అయితే రంగంలో వున్న స్వతంత్రుడు శ్రీ గొట్టిపాటి కొండప నాయుడు, వేణుగోపాల రెడ్డి ఓట్లను చీల్చుకొని వెళ్తున్నారు. నాయుడు గారి పట్ల జనంలో సానుభూతి వుంది. ఆయన తెలుగుదేశం ఓట్లను ఎంత ఎక్కువగా చీలిస్తే యానాది రెడ్డికి అంత లాభం.

## ఉదయగిరిలో సం"కుల"సమరం

ఉదయగిరిది ప్రధానంగా కుల పోరాటమే. కాంగ్రెస్ అభ్యర్థి శ్రీ మాదాల జానకి రాం ప్రధానంగా కమ్మ ఓట్ల పై ఆధార పడుతున్నారు. తెలుగుదేశానికి అభ్యర్థి లేకుండా పోవడంతో, అనధికార దేశం అభ్యర్థి శ్రీ విజయరామ రెడ్డి మేకపాటి రాజమోహన రెడ్డి కలసి సమైక్యంగా పని చేస్తున్నారు. వారి బలం రెడ్డి ఓట్లు. ఏ కులానిది పై చేయి అయితే వారిది గెలుపు.

కాని, మాగుంట సుబ్బరామ రెడ్డి గారు మనస్ఫూర్తిగా కాంగ్రెస్‌కు పనిచేస్తున్న ఒకే స్థానం ఉదయగిరి. ఆయన ద్వారా రెడ్డి ఓట్లలో కొంత చీలిక వస్తే మాదాల జానకి రాం గెల్చినట్లే!

## ఆత్మకూరులో దేశం మూడవ స్థానమా?

ఆత్మకూరులో తెలుగుదేశం మూడవ స్థానానికి నెట్టి వేయబడుతుందా అన్నది అనుమానం. కొమ్మి లక్ష్మయ్య నాయుడిని ఏ తెలుగుదేశం కార్యకర్తా పార్టీ అభ్యర్థిగా పరిగణించ లేక పోతున్నారు. ఆ వ్యతిరేకత సగం కాంగ్రెస్ అభ్యర్థి డాక్టర్ బి. సుందర రామరెడ్డికి లాభిస్తుంటే, తతిమా సగం బిజెపి దువ్వూరు రాధాకృష్ణా రెడ్డి తన్నుక పోతున్నారు. బిజెపికి కార్యకర్తలున్నారు కాని, ఓట్లు తక్కువ. రెండూ కల్గిన వాడు డాక్టరు గారు ఒక్కరే. నాలుగు సార్లు ఎమ్మెల్యేగా గెల్చిన రికార్డు స్థాపించబోతారా సుందర రామరెడ్డి గారు?

సంక్షిప్తంగా వివిధ నియోజక వర్గాల పరిస్థితి అది. కాంగ్రెస్ వాదులు ఇప్పటికైనా కలమేలుకొని కలసి పనిచేస్తే 1989 లో వలె జిల్లాలో విజయ దుందుభి మ్రోగించే అవకాశం వుంది. లేకుంటే తెలుగుదేశం పిల్లి అధిక స్థానాలు ఎత్తుక పోతుంది.

## ఎన్నికలు

(11వ పేజీకొరవ)

వారానికి కొంచెం అర్థమౌతుందేమో చూద్దాం!

## దేవకుమార రెడ్డి చరిత్ర సృష్టిస్తాడా?

గెలుపు ఓటముల సంగతి దేముడెరుగు కాని, కోవూరులో కాంగ్రెస్ అభ్యర్థి శ్రీ చేవూరు దేవకుమార్ రెడ్డి చరిత్ర సృష్టిస్తాడా అన్పిస్తుంది. నామినేషన్ నాటికి ఇది ఖాయమైన తెలుగుదేశం సీటు. కాని ఇప్పుడు గట్టి పోటీలో వున్న స్థానం. ఆ భయం కల్గబట్టే తెలుగుదేశం అభ్యర్థి నల్లపరెడ్డి ప్రసన్న కుమార రెడ్డి తన తల్లి శ్రీమతి శ్రీలక్ష్మమ్మను రంగంలోకి దించారు. ఆమె వూరు వూరు వాడ వాడ తిరుగుతున్నారు.

మాగుంట సుబ్బరామ రెడ్డి గారు ప్రత్యక్షంగా రంగంలోకి దిగి ప్రచారం చేస్తే ఉప ఎన్నికల్లో 30 వేల తేడాతో ఓడిన స్థానంలో, సాధారణ రైతు యువకుడైన దేవకుమార్ రెడ్డి తెలుగుదేశానికి చెమట పట్టించడం అద్భుతమైన విషయం. అయితే దురదృష్టవశాత్తు మాగుంట సోదరులు ఇక్కడా కాంగ్రెస్‌కు తూట్లు పొడుస్తున్నారు.

## ఎన్నిక లు

(9 వపేజీ కొర వ)

లోపల రామనారాయణరెడ్డి ఒకే రౌండ్ ప్రచారం పూర్తయి పోయింది.

ప్రచారం మొదటి నుంచే గెలుస్తాడనే మాట, విన్నదు తుందరంతో పాటు, తెలుగుదేశానికి మిగిలిన ఏకైక ప్రాముఖ్యత కల్గిన వర్గం - పాపకన్ను సోదరులు కూడా రామనారాయణ రెడ్డికే సహాయం చేస్తుండడంతో ఎల్లసిరి బలహీన పడిపోతున్నారు. మాగుంట సహకారం ధనరూపేణా తప్ప, జనం రూపేణా అందడం లేదు. స్వర్గీయ నువ్వుల

## ప్రకటన

ఇందు మూలముగా యావ న్మందికి తెలియజేయడం యేమనగా-

నేను అనగా బాలినేని రామిరెడ్డి S/o. వెంకటసుబ్బారెడ్డి, ఆదిత్యనగర్ నెల్లూరు. అను నేను నెల్లూరు కొరడావీధి కాపురస్తులు, వ్యాపారం, పడిగిరెడ్డి సుబ్బారెడ్డిగారి కుమారుడు చినగోపాల్‌రెడ్డి, పందిళ్లపల్లి రమణారెడ్డి కుమారుడు పందిళ్ళపల్లి బలరామిరెడ్డి అనువార్ల మీద నెల్లూరు సబార్డినేటు జడ్జివారి కోర్టులో నాకు వారి వద్దనుంచి రావలసిన Rs. 3,45,066/-లు దరిమిల్లా వడ్డీ, ఖర్చులు వగైరాలు రాబట్టు కొనుటకై O.S.N0. 163/1994 దావా వేసివున్నాను. సదరు దావా పెండింగ్‌లో వున్నది. పై వార్లు నాకు వారి వద్దవున్న డాక్యుమెంట్లు డిపాజిట్టుచేసి నెల్లూరు కొరడావీధిలోని పూర్వపు వార్డునంబరు 19;డోరు నంబరు.119; వార్డు నంబరు12; డోరునంబరు 234; ప్రస్తుత వార్డునంబరు19; డోరునంబరు 208; మరియు 207, HSC No.7830; గల యిళ్ళను, స్థలమును ఆడుమానము పెట్టి వున్నారు. పై నంబరు దావాలో ఆ అడుమానపత్ర ప్రకారం సదరు ఆస్తులను నా బాకీ క్రింద వేలము వేసి రాబట్టు కొనుటకు కూడా కోరివున్నాను. ఇట్లుండగలో పై పందిళ్లపల్లి బలరామిరెడ్డి, పడిగి రెడ్డి చిన గోపాల్‌రెడ్డి నాకు అడుమానముపెట్టి వుంచిన అస్తులను అన్యా క్రాంతములు చేసి ఏదో విధముగా నా బాకీ ఎగగొట్ట వలయునని ప్రయత్నించు చున్నట్లు నాకు తెలియుచున్నది. అట్లు వారు పై ఆస్తులను అమ్ముటకు హక్కులేదు, అమ్మినను సదరు ఆస్తుల మీద నాకు ఫస్టుచార్జి వుండి ఆ ఆస్తుల నుంచి రాబట్టు కొనుటకు నాకు హక్కు కల్గియున్నది. ఎవరైనను వారి వద్దనుంచి పై ఆస్తులను వారి యితర ఆస్తులను కొనుగోలుచేసినను మాకు యివ్వవలసిన బాకీ మొత్తము పైన చెప్పిన దావాలోని దావా మొత్తము, వడ్డీ, ఖర్చులు వగైరాలు నాకు చెల్లించవలసి వచ్చును. కావున నా బాకీకి లోబడి సదరు ఆస్తులు వున్నవి. ఈ విషయములు మీకు తెల్పడమైనది.

-బి. రామిరెడ్డి
ఆదిత్యనగర్, నెల్లూరు -2

వర్గం కూడా మాగుంట ఆదేశించినప్పటికీ మనస్ఫూర్తిగా అటు వెళ్లలేక పోతున్నది.

అంకయ్య గౌడ్ పోటీ నామకార్థమే. ఐదేళ్ల క్రితం ఎన్నికలో ఆయనకు 16వేల ఓట్లు వచ్చి వుండవచ్చు. కాని అప్పటి రాజకీయ పరిస్థితి వేరు. వ్యక్తిగతంగా కూడా ఆరోజు గౌడ్ అతిపెద్ద సారాయి కాంట్రాక్టర్. ప్రతి గ్రామంలో అంగడి, దాని కనుబంధంగా మనుషులు వుండేవారు. ఇప్పుడు స్వగ్రామంలో తప్ప మరెక్కడ మనుషులు దొరుకుతారు? గౌడ్ చీల్చేది కేవలంకాంగ్రెస్ ఓట్లేనా? అదే నిజమైతే అనాటి కాంగ్రెస్ అభ్యర్థి ఓడివుండాలి. గౌడ్ తెలుగు దేశం ఓట్లు కూడా పంచుకొంటే ఎల్లసిరి మరీ బలహీనులై పోతారు. ఈ నిజం ఆలస్యంగా ఊహించి ఇప్పుడు గౌడ్‌చేత విరమింప జేయాలని యత్నిస్తున్నారు సుబ్బరామరెడ్డిగారు. కానీ టూలేట్. పదికార్లు పెట్టి భార్య ఒక ప్రక్క, తానొక ప్రక్క తిరిగేసిన తర్వాత గౌడ్ వంటి మొండి మనిషి వెనక్కు వస్తాడా?

ఎన్‌టి రామారావు ప్రత్యేకంగా రాపూరులో సభ పెట్టుకున్నారు. దానితోనైనా జనం మరలుతారని ఆశ. కాని, రాపూరులో పార్టీ ఓట్లకంటే వర్గం ఓట్లు ఎక్కువ. పోలింగు రోజుకు ఈ నియోజక వర్గంలో పెద్ద మార్పు ఏదీ సంభవించకపోవచ్చు.

### జనార్దనరెడ్డిని ఆపగలరా?

వెంకటగిరిలో శ్రీ నేదురుమల్లి జనార్ధనరెడ్డిని ఓడించడానికి ఇటు జిల్లాలో మాగుంట, వేమారెడ్యాదులు; అటు రాష్ట్ర స్థాయిలో సిఎం, వైఎస్‌తదితరులు పంతంపట్టి పని చేస్తున్నారు. వైఎస్ యువసేన సభ్యులైతే బ్యానర్లు పట్టుకొని మరీ తెలుగు దేశంతో తిరుగుతున్నారు. వేమారెడ్డి స్వతంత్ర అభ్యర్థిత్వపు ఏకైక లక్ష్యం జనార్దనరెడ్డి ఓటమే కదా?

ఎందరెన్ని రకాలుగా ప్రయత్నించినా జనార్ధనరెడ్డిని ఆపడం వీలౌతుందా ? వేమారెడ్డి స్వతంత్ర అభ్యర్థిత్వం ఎగతాళిప్రాయమై పోయింది. దానివల్ల జనార్ధనరెడ్డికి నాలుగు సానుభూతి ఓట్లు పడడం తప్ప, వున్నవి పోయే పరిస్థితి లేదు. డిపాజిట్ సైతం తెచ్చుకోలేని దయనీయ స్థితిలో నిల్చిపోతారు రామచంద్రా రెడ్డిగారు. ఆయనకంటే బిఎస్‌పి అభ్యర్థి శ్రీ అల్లం ఈశ్వరయ్యకు ఎక్కువ ఓట్లు పోలౌతాయని అంచనా. వీరిద్దరు కలసి పెరుక్కొనే ఓట్లకు రెట్టింపు నియోజకవర్గంలో తాను చేసిన అభివృద్ధి పట్ల అభిమానం ద్వారా సంపాదించు కోగలుగుతారు. అభివృద్ధిని చూసే ఏ ఓటరూ కాంగ్రెస్‌కు తప్ప మరొక పార్టీకి ఓటు వేయలేరు

తెలుగుదేశం అభ్యర్థి వెంకటగిరి రాజా చాప క్రింద నీరువలె ప్రాకి పోతున్నారు. తొలిసారిగా ఎన్నికల బరిలో దిగడం వల్ల ఆయన పట్ల జనంలో కొత్తగా సానా

కన్పడుతున్నది. ఎస్.సి. వంటివారు మనస్ఫూర్తిగా పనిచేస్తే గట్టి పోటీ ఇవ్వగల్గుతారు.

అయితే 89 అసెంబ్లీ ఎన్నికల్లో జనార్ధనరెడ్డి 19 వేల మెజారిటీతో గెలిస్తే, 91 పార్లమెంట్ ఎన్నికలలో కాంగ్రెస్‌కు 29 వేల అధిక్యత వచ్చింది. జనార్ధనరెడ్డి అభివృద్ధి కార్యక్రమాల, పట్ల వెంకటగిరీయులు వ్యక్తం చేసిన ఆ విశ్వాసం పరిగణనలోకి తీసుకొంటే జనార్ధనరెడ్డి గెలుపు సందేహాతీతం అవుతుంది.

### వేమారెడ్డి విద్రోహమే పత్రాకు అదృష్టమా ?

సాధారణ పరిస్థితులలో గూడూరు కాంగ్రెస్ అభ్యర్థి శ్రీ పత్రా ప్రకాశరావు గెలవడం అసాధ్యం. 89 అసెంబ్లీ ఎన్నికల్లో కాంగ్రెస్‌కు 16 వేల మెజారిటీ వస్తే, పార్లమెంటులో 25 వేలు మైనస్ అయ్యాయి. ఏ కారణమైనా కానివ్వండి - గూడూరులో మొన్నటి వరకు అదీ పరిస్థితి.

కాని వేమారెడ్డి రామచంద్రా రెడ్డిగారి తిరుగుబాటు ఫలితంగా ఇప్పుడు ప్రకాశరావు మీద ఎక్కడలేని సానుభూతి వ్యక్తమౌతున్నది. బలవంతులందరూ కలసి ఈ బడుగు జీవిని హతం చేయ చూస్తున్నారన్న జాలి పెరుగుతున్నది. 16 తేది జనార్ధనరెడ్డి, పత్రా ఆఫీసు ప్రారంభోత్సవానికి వస్తే జనం విరగబడి వచ్చారు. కాంగ్రెస్ సర్పంచ్‌లందరూ ఒక్కరు తప్పి పోకుండా హాజరైనారు. తెలుగుదేశం ఓటర్లలోనూ ఈ విద్రోహానికి సమాధానం చెప్పాలన్న పట్టుదల కన్పిస్తున్నది. ఇవన్నీ ప్రకాశరావుకు అదృష్టంగా పరిణమిస్తున్నాయి. పోలింగ్ వరకు ఈ వూపు నిలిస్తే, పత్రా నక్కను తొక్కినట్లే !.

తెలుగుదేశం అభ్యర్థి శ్రీ బల్లి దుర్గాప్రసాద్ నల్లపరెడ్ల మెడలు వంచి ప్రచారానికి దించారు. అయితే ఆయనపై గ్రామ నాయకుల్లో చాలా భయ సందేహాలున్నాయి. వాటిని పోగొట్టి, ఎంతవరకు వారినుంచి అభిమానం సంపాదిస్తాడనే పరిణామంపై గూడూరు ఫలితం ఆధారపడి వుంటుంది.

### పెంచలయ్య అభిమన్యుడా ?

సూళ్లూరుపేటలో కాంగ్రెస్ అభ్యర్థి శ్రీ పసల పెంచలయ్య పరిస్థితి గమనిస్తే భారత యుద్ధంలో అభిమన్యుడు జ్ఞప్తికి వస్తున్నాడు. అన్ని శక్తులూ ఏకమై ఆయన్ను చుట్టు ముట్టుతున్నాయి. కానీ ఈ ఐదేళ్లలో పెంచలయ్య పేద ప్రజానీకంతో, బాలర్లతో ఏర్పర్చుకున్న వ్యక్తిగత సంబంధాలే ఆయన్ని రంగంలో నిలబెడుతున్నాయి.

తెలుగుదేశం అభ్యర్థి డాక్టర్ పరసా రత్నం బొమ్మతో సమానం. వెనుక నుంచి వేనాటి సోదరులు ఎటు ఆడిస్తే అటు ఆడాలి. తనుగా ఏమీ చేయలేదు. వేనాటి సోదరులు ఈ ఎన్నికను తమ ప్రతిష్టగా తీసుకొంటున్నారు. వారి పోరాటమూ

గట్టిగానే వుంది.

ఎటూ చెప్పలేని పరిస్థితి. పై

### ఫణిగుడు

(5 వ పేజీ కొరవ)

నిర్దేశించిన బస్సు దగ్గరకు వెళ్లాలి. బస్సు ఎక్కి కదిలిన తర్వాత ఇంకొక సీల్డు కవరు విప్పితేనే ఏఏ ఉద్యోగిని ఏఏ బూత్‌కు నియమించింది వుంటుంది. ఆ గ్రామం దగ్గరకు వచ్చేవరకు ఆ ఉద్యోగులకు ఆ విషయం చెప్పకూడదు. బస్సు ఆగిన తర్వాత పేర్లు చదివి, క్రిందకు దించాలి.

సిబ్బంది ఎవరి ఇంటా భోజనం చేయకూడదు ; టీ, కాఫీలు త్రాగకూడదు. వీరందరిపై నిఘా వుంటుంది. ఈ గందర గోళమంతా చూసి సిబ్బంది జ్వరం తెచ్చుకొంటున్నారు.

అభ్యర్థుల ఎన్నికల ఖర్చు, ప్రచారం తీరు విషయంలో కలెక్టర్ ఏ మాత్రం రాజీ పడడం లేదు; తన మన చూడడం లేదు. నిర్మొగమాటంగా అభ్యర్థిత్వాన్ని రద్దు చేసి పారేస్తానని హెచ్చరిస్తున్నాడు. ఆయన్ను చూస్తుంటే శేషన్ ఏదైనా పరకాయ ప్రవేశం చేసి వున్నాడా అన్పిస్తుంది! ఈ మాత్రం దండన భయం లేకుంటే రాజకీయ వాదులు మాట వింటారా చెప్పండి!

అయితే కలెక్టర్ ఎంత తాపత్రయ పడుతున్నాడో, పోలీసు అంత పక్షపాతంగా వ్యవహరిస్తున్నది. ఐడి పార్టీ కానిస్టేబిళ్ల ద్వారా ఎప్పటి కప్పుడు రాజకీయ సమాచారం సేకరించి అభ్యర్థులకు అందించడం; స్టేషన్లకు పిలిపించి ఫలానా వారికే పని చేయమని ఆదేశించడం జరుగుతూంది. పోలీసు విషయంలో ప్రత్యేక శ్రద్ధ తీసుకోకుంటే పోలింగు రోజు నాటికి కలెక్టర్ శ్రమంతా బూడిదలో పోసిన పన్నీరౌతుందేమో!

### నెల్లూరు సంగతులు

(5 పేజీ కొరవ )

ప్రముఖ వ్యక్తులకు 100 మీటర్ల దూరంలో ఎటువంటి ప్రేలుడు పదార్థాలుగాని, బాణాసంచా పేల్చరాదు. ప్రముఖ వ్యక్తులు ప్రయాణించే మార్గానికి 100 మీటర్ల దూరంలో ఏ వ్యక్తి మందుగుండు సామాగ్రి, ప్రేలుడు పదార్థాలు అమ్మడం, నిల్వ వుంచడం, కల్గివుండడం, ప్రేల్చడాన్ని నిషేధించారు జిల్లా కలెక్టర్ ఎం. సాంబశివరావు. అంటే ఎలక్షన్ ప్రచారంలో టపాసుల మోత కూడా ఇక వుండదన్నమాట !

### పసల పెంచలయ్య

(16 పేజీ కొరవ )

; తనను ఎంపిక చేసి గెల్పించారనే, భయంతో తాను ఇంకొకరి ఇల్లిముందు పగలు, రాత్రి పడిగాపులు కాసేవాడు కాకుండా, తన ఇంటికొచ్చే

ప్రజలతో రాత్రి, పగలు స్వేచ్ఛగా ప్రవర్తించే వాడై వుండాలి.

ఈ లక్షణాలు లేనిదే ప్రజా ప్రతినిధి ప్రజలకు వుపయోగ పడరన్నది నిజమై అయితే, సూళ్లూరు పేట ఎన్నికల్లో, పెంచలయ్య ఒక్కడే ఆ అర్హతలు కల్గిన వాడన్నది నిజం!

సూళ్లూరుపేట
నియోజకవర్గం
అభివృద్ధి కోరినా,
ప్రజల ఆత్మాభిమానం
పరిరక్షించాలన్నా
పెత్తందార్ల పెత్తనం
నివారించాలన్నా
ప్రజల సమస్యలు
సత్వరం తీరాలన్నా
పసల
పెంచలయ్యకు
ఓట్లేయడం
మన ధర్మం ;
ఇందిరమ్మ ఆదర్శం
అంబేద్కర్ ఆశయం
రాజీవ్ స్వప్నం
జగ్జీవన్ జీవన తాపత్రయం
కాంగ్రెస్ కలల ప్రపంచం
నిజం చేయాలంటే
పసల
పెంచలయ్యకు
ఓట్లేయడం
మన కర్తవ్యం.
ఆలోచించండి ;
నిర్ణయం తీసుకోండి !

-బద్దెపూడి వేణుగోపాలరెడ్డి

### ప్రకటన

కృష్ణాజిల్లా ప్రి. జిల్లా జడ్జి కోర్టులో
మచిలీపట్నం
M.V.O.P. 315/92

బిట్వీన్: మందలపు గోవర్ధనమ్మ,
వగైరా పిటీషనర్లు
మరియు
షేక్ కాలీషా & అదర్స్ రెస్పాండెంట్లు
టు
2వ రెస్పాండెంట్:
వి. వెంకటేశ్వర్లు, తండ్రి వెంకయ్య, లారీ ఓనరు, ఎ.బి.ఇ. 7755, ఉస్మాన్ సాహెబ్ పేట, నెల్లూరు

పై నెంబరులో పిటీషనర్లు మీపై నష్ట పరిహారము కోరుచూ దాఖలు చేసిన పిటీషన్‌కు మీ యొక్క హాజరు గూర్చి మరియు మీ యొక్క అభ్యంతరాలు తెలియ జేయు నిమిత్తము 28.11.1994 తేది ఉదయం గం. 10.30 ని.లకు వాయిదా ఉన్నది. సదరు వాయిదాకు మీరు హాజరు కానిచో మీ పరోక్షమున పిటీషను విచారించబడును.

కోగంటి సాయిమోహన్ రావు
పిటీషనర్ల అడ్వొకేట్
13/145, Edepalli,

# మంచినీళ్లకుకరువుండేపల్లెమిగలదు - కరెంట్‌దీపంవెలగనిఇల్లంటూవుండదు!

ఆత్మకూరు నియోజకవర్గం కాంగ్రెస్ అభ్యర్థిగా డాక్టర్ బి.సుందర రామిరెడ్డిగారు పోటీ చేస్తున్నారు. డాక్టర్‌గారి వైద్య సేవలు తాలూకా అంతా ఎంత విఖ్యాతమో, ఆయన ప్రజాసేవ సైతం అంతే ప్రాచుర్యం పొందింది.

డాక్టర్‌గారి చేతి చలువతో స్వస్థత పొందని ఆత్మకూరీయుడు లేడు; ఆయన సేవాభావంతో ప్రయోజనం పొందని గ్రామం ఆత్మకూరులో వుండదు. ఆయన భగీరథుడే ! సోమశిల ప్రాజెక్టు, రూపకల్పనలో, కాలువల త్రవ్వకంలో అడుగడుగునా ఆయన ప్రమేయం వుంది. పరుగు పరుగున సముద్రుడిలో లీనం కావడానికి ఉరకలెత్తుతూ పారే పెన్న నీటిని పట్టి బంధించి కాలువల గుండా పారించి, ఆత్మకూరు పొలాల ఎండిన రేగడి భూములను తడపడంలో డాక్టర్‌గారి కృషి అనుపమానం.

అంతటి ఫలితాన్నిచ్చేదే !
అడిగిన రైతులందరికీ
విద్యుత్ సౌకర్యం
ప్రతి ఇంటా
కరెంట్ దీపం
వెలిగించాలన్నది

చిన్న అభివృద్ధి కాదు.

ఐదువేల మంది పేదలకు పక్కా ఇళ్లు కట్టించిన ఘనత డాక్టర్‌దే !

సాధించి పెట్టాలని
డాక్టర్‌గారి ఆశ ;
ప్రజల కెప్పుడూ
అందుబాటులో



## ఆత్మకూరు అభివృద్ధికి ఎంత కృషిచేసినా తక్కువే; అయినా డాక్టర్ గారికి అలుపురాదు!



మనసు స్వచ్ఛం
మాట స్పష్టం
నిండైన వ్యక్తిత్వం
నిందన్నది ఎరుగని
ప్రజా జీవితం

అంతకు మించింది
ఢిల్లీ వరకు వెళ్లి
మంకుపట్టు పట్టి
సాధించి తెచ్చిన
ఆరున్నర కోట్లు
రాజీవ్ మిషన్
మంచినీళ్ల పథకం!
ఇది అమలైతే
గొంతార్పుకపోయే
గ్రామమన్నది
ఆత్మకూరులో మిగలదు.
192 పల్లెటూళ్లు
రక్షిత మంచినీళ్లు
కడుపారా త్రాగుతాయి!
రీకో సంస్థ సైతం

డాక్టర్ ఆశయం.

సోమశిల ప్రాజెక్ట్ క్రింద కరెంట్ ఉత్పత్తి కేంద్రం స్థాపించే ప్రయత్నం వుంది; పొగాకు రైతుల క్షేమం కోసం సాధించి తెచ్చిన ఆధునిక గోడౌన్ ఆయన కృషే ! చెరువుల రిపేరుకు, కాలువల మరమ్మత్తులకు



సుందర రామిరెడ్డి గారికి పాఠశాలల పట్ల ప్రత్యేక శ్రద్ధ. హైస్కూళ్లు స్థాపించారు. ఎలిమెంటరీ స్కూళ్లన్నింటికీ భవనాలు కట్టించారు.

ఆత్మకూరు వంటి ప్రాంతంలో ఎంత అభివృద్ధి చేసినా తక్కువే! చేసిందాని కంటె చేయవలసింది ఎప్పుడూ ఎక్కువగా వుంటుంది. ఇన్నేళ్ల నుంచి గ్రామ సమస్యల పరిష్కారానికి కృషి జరుగుతూనే

వుండడం;
ప్రజా సమస్యలు
సావధానంతో
చిత్తగించడం,
పదిమందికీ
సహాయపడడం
డాక్టర్‌గారి ఆశయం.
ఆయన ఆశలు తీరినా
ఆశయం నెరవేరినా
లాభపడేది
ఆత్మకూరు జనం !

ఆత్మకూరు పల్లెలకు డాక్టర్ సుందర రామిరెడ్డి గారు అపర

## జనార్ధనరెడ్డి

(2 వ పేజీ కొరవ)

మనలోనే వుండి,
మన సమస్యలెరిగి,
మన బ్రతుకులు
బాగు చేసే ప్రజా
సేవకులు కావాలి!
● అర్హత
● లక్షణం
● తత్వం
జనార్దన రెడ్డి
ఒక్కడికే వుంది!
అందుకే ఆయన్ను
గెల్పించుకుందాం;
ఆయనకే మన ఓట్లన్నీ
వేద్దాం, వేయిద్దాం!
రాజుల కాలం నాటి
బూజుపై మోజు ముఖ్యమా?
రాణకెక్కిన ప్రజా
సేవకు గుర్తింపా?
ఏది కావాలో,

దేన్ని కోరుకోవాలో,
తేల్చుకునే సమయం
వచ్చేసింది!
అందుకే ఈ ఓటు
పండుగలో ఆలోచించి
నిర్ణయం తీసుకోండి;
ఓటరు పరీక్షలో
విజ్ఞతతో వ్యవహరించండి!
జనార్దన రెడ్డి
కదిలించిన
అభివృద్ధి రథం
ముందుకు, ముసు ముందుకు
సాగాలంటే
అందరం చేయి కలిపి
చేయూతనిచ్చి
నడిపిద్దాం! రండి!

... చెలికం శంకర రెడ్డి

## ఐదువేలపక్కాఇళ్లుకట్టించారు - సోమశిలకాలువలుపూర్తిచేయిస్తారు!

కోట్లాది రూపాయలు తరలివచ్చాయి. ఆత్మకూరుకు ఎస్‌టిడి సౌకర్యం వచ్చింది. 80 పడకల ఆస్పత్రి ఏర్పడింది.

ఈ రోజు ఆత్మకూరు



నియోజక వర్గమంతటా వెదికినా రోడ్డులేని గ్రామం వుండదు. వెనుకబాటు తనానికి ప్రతీకగా వుండిన ఈ మెట్ట ప్రాంతంలో అది!

వున్నా డాక్టర్ గారికి అలుపు రాలేదు, రాదు కూడా ! ఇంకెంతో చేయాలన్న తపన ఆయనలో స్పష్టంగా కన్పడుతున్నది.

సోమశిల ఉత్తర
దక్షిణ కాలువల
నిర్మాణం పూర్తి,
పేదలందరికీ
పక్కా ఇళ్లు,
రైతులందరికీ
మోటార్లకు కరెంట్,
బడులన్నిటికీ
మంచి భవనాలు,
ఆస్పత్రులన్నిటిలో
చాలినన్ని మందులు

అందుకే మరొకసారి
అడుగుతున్నాం
ఓట్లన్నింటినీ



హస్తం గుర్తుకే
వేయమని ;
డాక్టర్‌గారిని
మళ్లీ గెల్పించమని !

- వాసిలి సుందర బాలయ్య

# రామచంద్రారెడ్డి (15వ పేజీ కొరవ)

వచ్చిన తరువాత జస్టిస్ పార్టీ వారు, అనేకులు కాంగ్రెస్‌లో చేరారు. కాని రామచంద్రా రెడ్డి గారు అలా చేరక తన స్థిర సంకల్పానికి, సిద్ధాంతాలకు ప్రతీకగా రాజాజీ ఏర్పరచిన స్వతంత్ర పార్టీ వ్యవస్థాపకులలో ఒకరైనారు. సర్దార్, బహదూర్, లాల్‌సింగ్ గారి సహకారంతో అఖిల భారత వ్యవసాయ దారుల సమాఖ్య ప్రారంభించారు. దానికి రెడ్డిగారు వుపాధ్యక్షులుగా వుంటూ రైతాంగం హక్కులు కాపాడటానికి నడుం కట్టారు. 1959లో ఆ సంస్థను స్వతంత్ర పార్టీలో విలీనం గావించి రాజాజీ, రంగా, కె.యమ్. మున్షి దండేకర్ జయపూర్ మహారాణి గాయత్రీ దేవి గారు మున్నగు వుద్ధండులతో వ్యవసాయ వుద్యమాలు చేపట్టారు. 1969లో జపాన్ వెళ్ళి అచ్చటి వ్యవసాయ వ్యవస్థను పరిశోధించి వాటిని మన దేశ ప్రజలకు తెల్పడానికి పత్రికలలో వ్యాసాలు రాశారు. స్వతంత్ర పార్టీ ఆంధ్ర -- దేశ శాఖాధ్యక్షులుగా 4 సంవత్సరాలు వుండి, తరువాత భారత దేశ పార్టీ వుపాధ్యక్షులయ్యారు. రాష్ట్ర శాసన సభ, లోకసభలలో తర్క సమ్మతమయిన వారి ప్రసంగాలు వారి ప్రతిభా వ్యుత్పత్తులకు గీటురాళ్లు. 1959లో తమిళనాడులో వివిధ ప్రాంతాలలో స్వతంత్ర పార్టీ తరపున ప్రథమ రైతు సమ్మేళనం ఏర్పాటు చేయగా రాజాజీతో పాటు రెడ్డిగారు కూడా పాల్గొని రైతు ఉద్యమాలు చేశారు. ఈ వుద్యమాలలో రాజాజీ, రంగా వంటి మహామేధావుల సాంగత్య సహకారాలు రెడ్డిగారికి కొండంత బలాన్ని యిచ్చాయి.

రెడ్డిగారి జీవితం మూడు వంతులు రైతుల సంక్షేమానికే అంకితమైనది. వారు చిన్న జమిందారు అయినా వెంకటగిరి, బొబ్బిలి, చల్లపల్లి మున్నగు జమీందారులతో సన్నిహిత సంబంధాలు కలిగి వుండేవారు. జస్టిస్ పార్టీ, స్వతంత్ర పార్టీలకు సంబంధించిన వారైనా ఇతర రాజకీయ పక్షాల వారితో స్నేహ సంబంధాలు కలిగి, రైతుల పక్షాన సహకరించే వారు. వారు ఏ కుల సంఘాలలో వుపన్యసించినా మొదట దేశము, తరువాత సంఘము అనేవారు. దక్షిణ ఇండియా మైదానాలన్నింటినీ సస్యశ్యామలం చేయాలనేది వారి తపన. నెల్లూరు జిల్లా భూసంస్కరణల వుద్యమాలలో రైతులకు రాయబారాలు చేస్తూ ఇతర జిల్లాలలో రైతు సంక్షేమ సంఘాలు ఏర్పరచారు. రాజకీయ ప్రతిపత్తిలేని రైతు సంఘాలు వుండాలనేవారు. వ్యవసాయ రంగంలో పాడి పరిశ్రమాభివృద్ధి రైతాంగానికి లాభదాయకంగా వుంటుందని గ్రహించి కావలి తాలూకా చింతల పల్లిలో ప్రభుత్వ పశు సంవర్ధక కేంద్రమును స్థాపించి నెల్లూరు జిల్లాకు వ్యవసాయ రంగంలో దేశ, విదేశాల గుర్తింపు తెప్పించారు. బుచ్చిలో రైస్ రీసర్చి స్టేషన్ ఏర్పాటు చేయించారు. రైతుల సమస్యల పరిష్కారానికి 1930లో స్వతంత్ర పత్రిక నడిపారు. భారత్ కృషక్ సమ్మేళనం స్టాండింగ్ కమిటీ ఉపాధ్యక్షులుగా వుండి భూ గరిష్ట పరిమితి రాజ్యాంగంలోని ప్రాథమిక హక్కులకు భంగకరమని లక్షలాది బంజరు భూములు, చిట్టడవులు, వ్యవసాయ యోగ్యం చేయడానికి ప్రభుత్వం కృతనిశ్చయం కావాలన్నారు. కౌలుదారుల మధ్య భూమిని సమానంగా పంపిణీ చేయాలన్నారు. గోదావరి ఫ్లడ్ రిలీఫ్ కమిటీ కోశాధికారిగా పనిచేశారు. నెల్లూరు వర్తక ఋణముల క్రయ, విక్రయ సహకార సంఘముల షేర్ హోల్డర్ల మహాసభలో మాట్లాడుతూ మిల్లు యజమానులు బియ్యపు కల్తీని అరికట్టాలని హెచ్చరించారు. జిల్లా కోఆపరేటివ్ మార్కెటింగ్ ఫెడరేషన్‌లో 1941 నుండి ప్రెసిడెంటుగా వుంటూ ధాన్యపు కొనుగోలులో విప్లవాత్మక పరిణామాలు తెచ్చి వుత్పత్తి దారులకు ఋణసౌకర్యాలు కల్పిస్తూ నెల్లూరు మొలగొలుకులకు ప్రత్యేక గుర్తింపు కలిగించుటలో ప్రధాన పాత్ర వహించారు.

## పారిశ్రామిక రంగం

ఉప్పు తయారీ కేంద్రంలో రెడ్డిగారు తన వంతు సేవ చేశారు. రీజనల్ సాల్ట్ సెస్ బోర్డ్ ఆఫ్ ఆంధ్రకు రెడ్డిగారు డైరెక్టరుగా పనిచేశారు. కృష్ణపట్నం, తడ, ఇస్కపల్లి సాల్ట్ ఫ్యాక్టరీల ఏర్పాటులో చురుకైన పాత్ర వహించారు. బకింగ్‌హామ్ కెనాల్ నుండి వేరే కాలువ త్రవ్వించి ఎగుమతి సౌకర్యాలు కలిగించారు. ఉప్పు కర్మాగార కార్మికులకు విద్యాశాలలు, వైద్యశాలలు, పి.యఫ్. సౌకర్యాలు సహకార సంఘాల ద్వారా వడ్డీలేని ఋణ సౌకర్యాలు కల్పించారు. తరువాత సెంట్రల్ సాల్ట్ బోర్డ్ మెంబరుగా వుండినారు. మద్రాసు మైకా అసోసియేషన్ ఛైర్మన్‌గా వుంటూ మైకా టేప్, మైకా ఫోలియం హీటర్ మైక్యునైట్ వస్తు ఉత్పత్తులలో మైకా ప్రాధాన్యత గుర్తించి వ్యాపార దక్షులుగా పేరొందారు. మచిలీపట్నంలో ఆంధ్ర సైంటిఫిక్ కంపెనీ డైరెక్టరుగాను, నేషనల్, కెమికల్ మరియు సైంటిఫిక్ గ్లాస్ ప్రొడక్షన్ కంపెనీలకు డైరెక్టరుగాను పనిచేశారు. మాన్యుఫ్యాక్చరింగ్ ట్రేడ్‌లో, కెమికల్స్ విషయంలో నాణ్యతకు ప్రాధాన్యం యిచ్చి కంపెనీ పురోభివృద్ధికి తోడ్పడ్డారు. తమిళనాడు సౌత్ ఆర్కాట్ జిల్లాలోని విల్లిపురంలో వున్న మద్రాసు వనస్పతి లిమిటెడ్ కంపెనీ ఛైర్మన్‌గా వుంటూ వుత్పత్తి వినియోగ రంగాలలో క్రియాశీలక పాత్ర నిర్వహించారు. ఇండియా సిమెంటు పరిశ్రమ, ఆంధ్ర సినిటోన్ చలన చిత్ర పరిశ్రమ స్థాపనకు కారకులై వాటి పురోభివృద్ధికి తోడ్పడ్డారు. కార్మికుల మధ్య, గనుల యజమానుల మధ్య తగాదా ఏర్పడినపుడు దాని పరిష్కారానికి "లేబర్ ఆఫ్ లేట్ ట్రిబ్యునల్ ఆఫ్ ఇండియా" అనే న్యాయ స్థానం ముందు తన వాదనను రెడ్డిగారు సహేతుకంగా వినిపించి కార్మిక సమస్యలు పరిష్కరించారు. 1938సంవత్సర ప్రాంతంలో యమ్.యస్.యమ్. రైల్వే బోర్డు సభ్యులుగా వుండి, కోవూరు నుండి సంగ్యాలకు రైల్వే లైను ఏర్పాటు గురించి కృషి చేసి రైల్వేలైను అభివృద్ధి క్రింద రైతుల వద్ద దామాషా పద్ధతిలో తాలూకా బోర్డుల సంపకం క్రింద 3 5 వేలు ద్రవ్యసేకరణకు ప్రయత్నాలు చేశారు. అది కార్యరూపం దాల్చలేదు. నెల్లూరు రైల్వేస్టేషన్ పునర్ నిర్మాణంలో, స్టేషన్ నటిపె నిర్మాణంలో వారి పాత్ర ఎంతో కలదు. డా. మోడి గారిని పిలిపించి నెల్లూరు పి.ఆర్. హైస్కూలులో వుచిత నేత్ర శిబిరాన్ని నిర్వహించిన వుదార స్వభావులు.

## విద్యా సాహిత్య రంగాలు

1940-42 ప్రాంతంలో ఆంధ్ర విశ్వవిద్యాలయం సిండికేట్ మెంబరుగా, 1956-57 ప్రాంతంలో శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయ గవర్నింగ్ బాడీ మెంబరుగా వుండి వున్నత విద్యారంగంలో యెన్నో సంస్కరణలు తెచ్చారు. అనుబంధ కళాశాలల్లో సంగీతాన్ని ఏర్పాటు చేసే కృషి చేశారు. ఆంధ్ర ప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయ వ్యవస్థాపక కమిటీ అధ్యక్షులుగా వుండి ఫోర్డ్ అండ్ రాక్ ఫెల్లర్ ఫౌండేషన్లసహకారంతో ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయం స్థాపనకు కృషి చేశారు. స్నాతకోత్తర తరగతులకు పరిశోధన రంగాలకు వ్యవసాయంలో యు.జి.సి.ల నుండి నిధులు సమకూర్చారు. కావలి విశ్వోదయ కళాశాల వ్యవస్థాపకులలో ప్రముఖ పాత్ర వహించారు. ఆంధ్రప్రదేశ్ ప్రయివేట్ కళాశాలల మేనేజిమెంట్ తరపున ఆ సంఘం వారితో నాటి యు.జి.సి. ఛైర్మన్ సి.డి. దేశముఖ్ గారిని కలసి కళాశాలలకు యు.జి. సి. వనరులను కలిగించారు. ఇది వారి పట్టుదలకు, కార్యదీక్షకు, నిదర్శనం. 1958-60 ప్రాంతంలో తిరుపతి సంస్కృత విశ్వపరిషత్ సభలలో పాల్గొని నాటి ప్రెసిడెంట్ రాజేంద్ర ప్రసాద్ గారి మన్ననలు పొందారు. అనేక ధార్మిక సంస్థలలో వారు ప్రముఖులై నెల్లూరు జిల్లా రామతీర్థం రామలింగేశ్వర స్వామి దేవాలయ ధర్మకర్త మండలి అధ్యక్షులై ఆ నిధుల నుండి నెల్లూరు వేద సంస్కృత కళాశాలకు ఆగమ భవన నిర్మాణము గావించిన వదాన్యశేఖరులు రెడ్డిగారు. సాహిత్యరంగంలో దొడ్డ సంస్థానమే ఒక సాహితీకేదారం. ఎన్నో కవితా గోష్ఠులు అవధానాలు నిర్వహించి కవి పండిత సత్కారాలు చేశారు. ఎన్నో గ్రంథ ముద్రణలకు ఆర్థిక సహకారం అందించారు. ఎన్నో గ్రంథాలకు పీఠికలు, సమీక్షలు వ్రాశారు. ఆంధ్ర నాటక కళాపరిషత్తు అధ్యక్షులై నటులెందరినో పోషించారు. నాటక సంఘాలకు ఆర్థిక సహకారం చేశారు. కవి పండితులకు విద్యా సంస్థలకు విరాళము లిచ్చారు. గుర్రం జాషువా, దువ్వూరు రామిరెడ్డి, పుట్టపర్తి, దీపాల, మధునాపంతుల వంటి పండిత ప్రకాండులను ఆదరించిన సాహితీ మూర్తులు. భగవద్గీత శ్లోకాలు వారికి వాచోవిధేయం. భారత, భాగవత, రామాయణాది విమర్శలు వారికి కరతలామలకం. గ్రాంధిక భాషావాదాన్ని సమర్థించినవారు. కవిగా రెడ్డిగారు మాతృ శతకమనే గ్రంథాన్ని 110 పద్యాలతో వ్రాసి తన మాతృమూర్తికి అంకితం చేశారు.

ఇలా రెడ్డిగారు అనేక హోదాలలో కేంద్ర ప్రభుత్వ అకౌంటు కమిటీ సభ్యులుగా, వుభయ గోదావరి, కృష్ణా జిల్లాల ఆర్థిక విచారణ సంఘ సభ్యులుగా, ల్యాండ్ రెవిన్యూ కమిటీ సభ్యులుగా వుండినారు. కార్యదీక్ష, నిజాయితీ, విద్యుక్త ధర్మ నిర్వహణ, మితభాషిత్వం, వారి వ్యక్తిత్వ వికాసానికి సోపానాలు. పదవులకై వెనుగులాడలేదు. నమ్మిన సిద్ధాంతాలను వమ్ము చేయలేదు. కాంగ్రెస్‌లో చేరకయే దేశానికి అన్ని రంగాలలో ఆదర్శవంతమైన సేవ చేశారు. రాజకీయాలలో ఏ వర్గంవారు కూడా వారిని విమర్శించడం జరగలేదు. ఏ కార్యక్రమంలో కూడా అందరి సత్యాన్ని, నిజాయితీని గ్రహించనిదే దిగేవారు కాదు. కాంగ్రెస్ ప్రభుత్వ పరిపాలనలో వారు జీవించి వున్నంత వరకు ప్రభుత్వం వ్యవసాయ రంగంలో నీటిపారుదల ప్రణాళికా విషయాలలో రెడ్డిగారిని సంప్రదించి చేసిన కార్యక్రమాలు ఎన్నో వున్నాయి. 1954లో జరిగిన వారి షష్టి పూర్తి కార్యక్రమంలో డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి గారు పాల్గొని రెడ్డి గారిని "వారి వేషంలో మార్పు లేనట్లే రాజకీయ జీవితంలో కూడా తమార్పులేదన్నారు. అదే వారి మీద నాకున్న గౌరవం" అన్నారు. రెడ్డిగారి స్థిర సంకల్పానికి ఈ మాట మచ్చుతునక. రాజకీయాలలో ఎన్ని భేదాభిప్రాయాలున్నా ఎదుటివారి అభిప్రాయాలు గౌరవించడం వారి విశిష్టత. స్వాతంత్ర్యోద్యమంలో దిగకపోయినా విదేశ వ్యామోహానికి లోనుగాక స్వదేశాభిమానాన్ని సంప్రదాయాన్ని గౌరవిస్తూ వ్యవహరించిన మహా మనిషి రెడ్డిగారు. అన్ని రాజకీయ పార్టీల వారూ వారిని పెద్దరెడ్డిగా గుర్తించేవారు. వారు 1973 మార్చి 19న స్వర్గస్తులయ్యారు.

అట్టి అమలోదాత్త మహా మనిషికి మచ్చలేని రాజకీయ నాయకుడుకి శత జయంత్యుత్సవాలు నెల్లూరు నగరంలో నవంబరు 24వ తేది నిర్వహించడం అవిచ్ఛిన్న ప్రజా సంక్షేమ కార్యనిర్వాహకునిగా అజాత శత్రువుగా ప్రజా హృదయాలలో శాశ్వత ముద్ర వేసుకున్న వారి దివ్య తన్మృతులకు నీరాజన మర్పించడమే అవుతుంది.

డాక్టర్ ఉడాలి నరసింహశాస్త్రి

## తూట్లు-మొదటి పేజీకొరవ

మహారాజ్‌గంజ్ టిక్కెట్టు ఇవ్వడంతో స్థానికంగా తీవ్ర వ్యతిరేకత ఏర్పడింది. చివరకు పోలీసు బందోబస్తుతో కేశవరావు నామినేషన్ వేయాల్సి వచ్చింది. అలాగే ఊడగొట్టిన నాగర్లు కె.వి.కేశవులు, జగన్నాథ రావులాంటి వాళ్లకు పి.వి. టిక్కెట్లు ఇచ్చి అస్మదీయరాగం ఆలపించారు. కానీ వీరిలో ఎంతమందికి డిపాజిట్లు వస్తాయన్నది పి.వి. పట్టించుకోలేదు.

ఇండిపెండెంట్ల జోరు

ఈ ఎన్నికల్లో ఇండిపెండెంటు అభ్యర్థులు ఎక్కువగా గెలిచే అవకాశాలున్నాయి. ముఖ్యమంత్రి కూడా ఇండిపెండెంట్ల గెలుపు మీదనే ఎక్కువ ఆశలు పెట్టుకున్నాడట. కాంగ్రెస్ పార్టీకి 140 దాకా సీట్లు వస్తాయని, మిగతా ఇండిపెండెంట్లను కూడగట్టుకొని తిరిగి అధికారం లోకి రావాలన్నది ముఖ్యమంత్రి " చిరు" కోరికట. అధికార పార్టీ అధినాయకుడు ఇండిపెండెంట్ల గెలుపుకు మార్గం సుగమం చేయటానికి పదవీ వ్యామోహం కారణం కావడం కాంగ్రెస్ పార్టీ గ్రహచారం.

ప్రస్తుత పరిస్థితిని బట్టి కాంగ్రెస్ తిరుగుబాటు అభ్యర్థులు 80 మందిదాకా రంగంలో వుండగా రాయలసీమ ప్రాంతంలో దాదాపు 20 మంది తెలుగుదేశం వారిని కాంగ్రెస్ పార్టీ ముఠాలు సమర్థిస్తున్నాయి. దీనితో వంద స్థానాలు కాంగ్రెస్‌కు ఖచ్చితంగా గండిపడే అవకాశాలున్నాయి. కాగా తెలుగుదేశం పార్టీలో కూడా తిరుగుబాటు బెడద వున్నా అవి ఎక్కువగా మిత్రపక్షాల స్థానాల్లో వున్నాయి. కాంగ్రెస్‌తో పోల్చితే, దేశం తిరుగుబాటు జాడ్యం తక్కువే. అయినా దీనివల్ల తెలుగుదేశంకు ముప్పై స్థానాల్లో ఇబ్బంది లేకపోలేదు.

కాంగ్రెస్ ముఠాల పుణ్యమా అని ఓడిపోతామనుకున్న స్థానాల్లో కూడా తెలుగుదేశంకు గెలుపు అవకాశం మెరుగైంది. దీంతో దేశం అధినేత అప్పుడే ముఖ్యమంత్రి అయిపోయానన్న ధీమాతో ప్రచారానికి శ్రీకారం చుడుతున్నాడు. కాంగ్రెస్ వాళ్లు మాత్రం ఎవరికి వారే అన్నట్లు అసమ్మతి కుంపట్లను రాజేసు కుంటున్నారు. ఈ నేపథ్యంలో ప్రధాని పి.వి. రాష్ట్రంలో ప్రచారాన్ని ప్రారంభిస్తున్నారు. ప్రధాని తెలుగువారైనందువల్ల తెలుగు ఓటర్లు కాంగ్రెస్‌కు ఓటు వేస్తారన్న " చిన్ని" ఆశ తప్పితే, కాంగ్రెస్‌లో గెలుస్తామన్న ధీమాకు ఆస్కారం లేకుండా పోయింది.

# నియోజకవర్గంతో విడదీయరాని అనుబంధమే యానాదిరెడ్డిగారి విజయానికి సోపానం!

కావలిలో కాంగ్రెస్
కలికి వేర్వేరు కాదు;
కాంగ్రెసే యానాదిరెడ్డి
యానాదిరెడ్డే కాంగ్రెస్!

ఇప్పుడూ అంతే.
ఎప్పుడూ అంతే!

కావలి నియోజక వర్గంలో కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీ చేస్తున్న శ్రీ కలికి యానాది రెడ్డి గారి గురించి ఇప్పుడు కొత్తగా చెప్పవలసిందేమీ లేదు. నియోజక వర్గంలో ఆయనకు తెలియని గ్రామం లేదు, తెలియని మనిషి లేదు. మనుషులతో మెలగడంలో, మానవ సంబంధాల కొనసాగింపులో ఆయన కాయనే సాటి. ప్రజా సాన్నిహిత్యంలో

కారణం...
ఆయన వ్యక్తిత్వం
ఆయన సౌశీల్యం

**కావలిలో కాంగ్రెస్**

ఆయన నిజాయితీ
ఆయన నిర్భీతి
ఆయన సేవాసక్తి

ఒకే మర్యాద, ఒకే ఆదరణ.

అందువల్లే యానాది రెడ్డి గారు ఇంత కాలం ప్రజలతో సజీవ సంబంధాలు నెరపుకో గల్గుతున్నారు. ఎన్నిసార్లయినా ఓట్లడుగ గల్గుతున్నారు.

ఈసారి గెలిస్తే, గెల్పిస్తే చాలా చాలా అభివృద్ధి పనులు చేసి పెట్టాలనే తపన వుంది. ఆరున్నర కోట్లతో సమ్మర్ స్టోరేజి ట్యాంకు నిర్మిస్తే కావలి టౌన్ దాహం శాశ్వతంగా తీరుతుంది. నిధులు మంజూరైనాయి. పనే సోమశిల నీళ్ళు కళకళ లాడింప జేస్తున్నాయి.

కావలి తీర ప్రాంతాలలో ఈ రోజు తారు రోడ్డులేని గ్రామం లేదు. ప్రతి గ్రామంలో పక్కా ఇళ్ళ నిర్మాణం జరిగింది. ఎన్ని మంచి నీటి పథకాలు యానాది రెడ్డి గారి కృషితో పూర్తయ్యాయో చెప్పలేము. మైనర్ ఇర్రిగేషన్ చెరువుల రిపేరులో ఎన్ని వేల మంది రైతులు లాభపడ్డారో చెప్పలేము.

మునిసిపాలిటీకి మాత్రం ఎప్పుడూ నిధుల కొరత. లేకుంటే కావలి జనాభా అభివృద్ధి కళ్ళకు కట్టినట్లు కన్పడేది. ఈ సారి గెల్పిస్తే ఆ ఇబ్బంది కూడా లేకుండా నిధులు తెచ్చి టౌన్‌ను మెరుగు పరచగలడన్న నమ్మకం వుంది.

## ప్రజలతో సాన్నిహిత్యంలో ఆయనకురారెవ్వరూ సాటి!

ఇరవయ్యేళ్ల నుంచి
అదే ఆనవాయితీ!
జనంతో సంబంధమే
అంతటి అనుబంధానికి
కారణం, ప్రేరణం

ఆయనకు రారెవ్వరూ సాటి! నియోజక వర్గంలో యానాది రెడ్డి గారి అనుబంధం విడదీయరానిది. ఎన్నేళ్ళు గడిచినా అది మరింత సుదృఢమౌ తున్నది తప్ప తెలిక పడడం లేదంటే అందుకు

మాదాల (4 వ పేజీ కొరవ)

ఉదయగిరి ప్రజానీకపు జీవితాలలో నాగరికత చిహ్నాలు కొట్టొచ్చినట్లు కన్పించాలంటే; ప్రగతి సిరి, విరిమల్లె మొగ్గవలె రేకులు విప్పి సువాసనలు ప్రసరించాలంటే.

జానకిరాం వంటి సేవకుడు
జానకిరాం వంటి పాలకుడు
జానకిరాం వంటి
ప్రజాహితుడు
జానకిరాం వంటి సామాన్యుడు
జానకిరాం వంటి కపటం
లేనివాడు
జానకిరాం వంటి
నిష్కల్మషుడు
జానకిరాం వంటి దీక్షా పరుడు
జానకిరాం వంటి పోరాట
యోధుడు
మనకు కావాలి;
అందుకే మనం,
అంటే
ఉదయగిరి వాసులం
జానకిరాంను
మరొకసారి
గెల్పించుకోవాలి!
మళ్లీ మళ్లీ
గెల్పించుకోవాలి!

కేవలం పదవుల కోసం, ప్రాభవం కోసం, ఓట్ల భిక్షనర్థిస్తూ మన ముందుకు ఎందరో వస్తున్నారు; కన్నీళ్లు కారుస్తూ ప్రాధేయ పడ్తున్నారు. కాని కన్నీళ్లతో మన కాటకాలు తొలగవు; కల్లబొల్లి మాటలతో మన కష్టాలు తీరవు; మనకిప్పుడు కావలసింది, మనమిప్పుడు కోరవలసింది, మనకెప్పుడూ అవసరమైంది – మన బ్రతుకులు బాగుపర్చే నాయకుడు; మన చెరువులలో నీరు నింపే భగీరథుడు; మన రహదారులు బాగుచేసే సేవకుడు.

ఆ ఆశలు తీర్చగల
ఆ లక్ష్యం సాధించగల
ఆ ఆదర్శంతో నడవ గల
జానకిరాంకు
ఓటేద్దాం!
గెల్పించుకుందాం!
రండి – చేయూత నివ్వండి!

.... ఎం.వి. నారాయణ రెడ్డి
మాజీ మండలాధ్యక్షుడు

## అనారోగ్యం అడ్డంకి కాదు – అభివృద్ధికి అవరోధం కాబోదు!

జనం పై అనురక్తి

మూడు టరమ్‌లు ఎమ్మెల్యేగా గెల్చినా నిండన్నది పడని నిజాయితీ పరుదు

యానాదిరెడ్డి; మంత్రిగా ఎదిగినా మచ్చలేని సౌశీల్యం యానాది రెడ్డి స్వంతం. ఎవ్వర్ని చూసి భయపడరు, ఎవ్వరికీ తలవంచరు, ఎవర్నీ అగౌరవ పరచరు. సామాన్యుడొచ్చినా, సంపన్నుడొచ్చినా ఒకే తీరు, ఒకే మాట,

మొదలు కావలసి వుంది. ఇందుకోసం వంద ఎకరాల అటవీ భూమి కూడా సిద్ధం. శేషన్ ఆంక్ష లేకుంటే శంకుస్థాపన జరిగి పోయి వుండేది.

ఉదయగిరి రోడ్డు లెవల్ క్రాసింగ్ వద్ద రైల్వే ఓవర్ బ్రిడ్జి యానాది రెడ్డి గారు సాధించుకు తెచ్చినదే. కాంట్రాక్టర్ నిర్లక్ష్యంతో ఆగింది కాని, లేకుంటే ఈపాటికి వాహనాలు రయ్యమని వెళ్తుండేవి దాని పైన.

ఎక్కడ సోమశిల? ఎక్కడ కావలి చెరువు? ఎన్నో ఏళ్ళుగా ఆఫీసు బీరువాల క్రింద దుమ్ము కొట్టుక పోయిన ఫైళ్లను దులిపి, వెలికి తెచ్చి, అంత పొడుగు కాలువ కట్టించేందుకు కృషి చేసింది యానాది రెడ్డి గారే! కావలి చెరువును ఇప్పుడు

అభివృద్ధితో పాటు
జనానికి అందుబాటులో
వుండగల్గడమే
యానాదిరెడ్డి
విశిష్టత!
అనారోగ్యం
ఈ అనుబంధానికి
అవరోధం కాదు,
అభివృద్ధికి
అడ్డంకి కాబోదు

కలికి యానాది రెడ్డి గారిని మళ్ళీ గెలిపించు కోవటం, కావలి పౌరులకు గౌరవ ప్రదం మన ఓట్లన్నీ ఆయనకే వేద్దాం; ఘన విజయం చేకూర్చుదాం.

– ఒక కాంగ్రెస్ అభిమాని

# నెల్లూరు గర్వించదగ్గ నాయకుడు బెజవాడ రామచంద్రారెడ్డి!

## సోమశిలకు అంకురార్పణ చేసింది, స్వర్ణముఖిపై వంతెన కట్టించింది, రైస్ రీసర్చ్ స్టేషన్ స్థాపించింది, సాల్ట్ ఫ్యాక్టరీలు పెట్టించింది ఆయనే!

అందరూ పుట్టుకతో గొప్పవారు కారు! వారు చేసే త్యాగాలు ఉద్యమాలు, చూపే ప్రతిభా సామర్థ్యాలు వారిని మహనీయులుగా నిలుపుతుంది. చరిత్ర; జాతీయంగా, అంతర్జాతీయంగా పేరు ప్రఖ్యాతులు ఇనుమడింప జేస్తుంది. అట్టి ఆదర్శాలకు ప్రతీకగా, అన్నిరంగాలలో అజాత శత్రువై, మహోన్నత స్థానాన్ని అందుకొని, మానవాళి సౌభాగ్యానికి, దేశ శ్రేయస్సుకు పాటుపడి; ఆత్మ విశ్వాసం, నిజాయితీ, మానవత కలిగి తపుటల్లో అగ్రగణ్యులుగా పేర్కొనదగినవారు — కీ.శే. బెజవాడ రామచంద్రారెడ్డిగారు. వారిని గూర్చి ఏమి వ్రాసినా, ఎంత వ్రాసినా అద్దంలో ఆకాశాన్ని చూపడమే.

వీరి స్వగ్రామం నెల్లూరుజిల్లా, బుచ్చిరెడ్డిపాళెం. 1894 నవంబరు 24వ తేది జన్మించారు. దొడ్ల సంస్థానాధీశులు, దొడ్ల రామాయణ రచయిత దొడ్ల వెంకటరామిరెడ్డి గారు వీరి మేనమామ. వంశ గౌరవ ప్రతిష్టకు దాన ధర్మాలకు, కవి పండిత పోషణకు, రాచరికానికి ఆటపట్టయిన దొడ్ల సంస్థాన కుటుంబంలో ఆ వంశ కీర్తికి వారసులై గౌరవ ప్రతిష్టలు ఇనుమడింప జేశారాయన. రామచంద్రా రెడ్డిగారు హైస్కూలు విద్య కావలిలోను, కళాశాల విద్య మద్రాసు పచ్చయప్ప కళాశాలలోను పూర్తి చేశారు. అందులో వారి కుమారుడు శ్రీ బెజవాడ పాపిరెడ్డి గారు రాజకీయ రంగంలో తండ్రి గారి వారసత్వాన్ని పుణికి పుచ్చుకొని తండ్రిగారి జీవిత రేఖలకు మెరుగులు దిద్దారు. రామచంద్రా రెడ్డి గారికి 11 మంది సంతానం. 6 గురు కుమారులు, 5 గురు కుమార్తెలు; అందరూ వంశ గౌరవ ప్రతిష్టకు తగిన విధంగా మెలగుతున్నారు.

రామచంద్రా రెడ్డి గారు రాజకీయ, సాంఘిక, పారిశ్రామిక, వ్యవసాయ, విద్యా, సాహిత్య రంగాలలో ఆదర్శ జీవితం గడిపి, ఎన్నో పదవులు నిర్వహించి, ప్రజాసేవలో ప్రజాబంధుగా కీర్తిగాంచారు. రాచరికాన్ని స్ఫురింపచేసే తలపాగా, భారతీయ సంస్కృతికి చిహ్నమయిన ధోవతి, నిండుతనానికి ధీటైన కోటు, వారి మూర్తి మత్వాన్ని రూపుదిద్దింది. ఇటు రామచంద్రా రెడ్డి, అటు డాక్టర్ బెజవాడ గోపాల రెడ్డి గార్ల సుస్థిర రాజకీయ చరిత్ర వల్ల బుచ్చి రెడ్డి పాళెం దేశ వ్యాప్త గౌరవాన్ని పొందింది.

### రాజకీయ రంగం

భారతీయులలో రాజకీయ చైతన్యం అంకురించి, బ్రిటీషు ప్రభుత్వ నిరంకుశ పాలనను ప్రజలు నిరసించడం ప్రారంభమై, ఈ అలజడిని తోకొట్టడానికి బ్రిటీషు పాలకులు శాసన సభలు, జిల్లా బోర్డులు వంటి కంటి తుడుపు సంస్థలు ప్రారంభించే దశలో



1919లో బెజవాడ రామచంద్రా రెడ్డి గారు మద్రాసు పచ్చియప్ప కళాశాలలో చదువుతుండినారు. అక్కడ సర్వ ప్రథములుగా పట్టభద్రులైన తరువాత వారి జీవిత విహంగం రెక్కలు విప్పసాగింది. పంచాయితీల మొదలు పార్లమెంటు వరకు వారి రాజకీయ జీవితం వటవృక్షంలా ఎదిగింది. 1919లో నెల్లూరు జిల్లా వవ్వేరు గ్రామాధికారి పదవిని చేపట్టి గ్రామీణ జీవన వ్యవస్థలో శాశ్వత గ్రామ సంక్షేమ పథకాలను సమకూర్చి బడుగువర్గాల జీవితాలలో వెలుగులు నింపారు. గ్రామ పంచాయితీ అధ్యక్ష పదవిని బుచ్చిరెడ్డిపాళెంలో చేపట్టారు. 1923లో తాలూకా సభ్యులుగా ఎన్నుకోబడ్డారు. 1929లో నెల్లూరు జిల్లా అధ్యక్షులుగా ఎన్నుకోబడి (జిల్లా బోర్డు) కసుమూరు, కొవ్వూరు, వవ్వేరు, వేగూరు మున్నగు రోడ్ల వంతెనల నిర్మాణాలు, పెన్నానదిపై వంతెనలకు ఎస్టిమేట్లను ఆనాడు అంగీకరింపచేశారు. జిల్లా విద్యాశాఖ కౌన్సిల్ ఛైర్మన్‌గా వుండి విద్యారంగంలో పాఠ్యభాగ ప్రణాళికా నిర్ణయాలలో నైతిక పాఠ్యాంశాలు ప్రవేశ పెట్టారు. జిల్లా బోర్డు అధ్యక్షులుగా వుండేటప్పుడు కావలి, కనిగిరి, ఉదయగిరి, కందుకూరు గ్రామాలలో ఉన్నత, మాధ్యమిక పాఠశాలలు, వైద్యశాలలు ఏర్పాటు చేశారు. ఆనాటి మోమిడి సుబ్బరామయ్య ధర్మాయుర్వేద వైద్యశాలను బోర్డు స్వాధీనం చేసుకొని కేంద్ర ఔషధీ నిలయమనే పేరుతో నెల్లూరులో స్థాపించారు. జిల్లా బోర్డు అధ్యక్షులుగా వున్నపుడే సువర్ణముఖి బ్రిడ్జి నిర్మాణ పథకాలు తయారు చేశారు- వారు శాసన సభాధ్యక్షులు అయిన తరువాత ఆ నిర్మాణం పూర్తియై ప్రారంభోత్సవం జరిగింది. దానికి రామచంద్రా బ్రిడ్జి అని నామకరణం చేశారు. వెంకటగిరి రాజాగారు!కాని రెడ్డిగారు తన పేరు పెట్టడాన్ని వ్యతిరేకించారు.

రెడ్డిగారు విద్యార్థిగా వున్నపుడే మద్రాసులో పెరియార్ రామస్వామి నాయకర్ స్థాపించిన సెల్ఫ్ రెస్పెక్ట్ వుద్యమంలో ప్రభావితులై బడుగు వర్గాల కోసం పోరాడుతున్న సౌత్ ఇండియన్ లిబరేషన్ ఫెడరేషన్‌లో చేరారు. తరువాత దానికి అనుబంధమైన రాజకీయ శాఖ జస్టిస్ పార్టీలో కూడా చేరారు. వెంకటగిరి రాజా, పానకా గోవింద రెడ్డి, యాహ్యాలి సాహెబ్, కాళహస్తి, బొబ్బిలి రాజాలు ఆనాడు జస్టిస్ పార్టీలో చేరినవారే. ఫెడరేషన్ నాయకుడు త్యాగరాయశెట్టి బ్రాహ్మణాధిక్యతను తగ్గించి బ్రాహ్మణేతరులను పైకి తేవాలని ఈ ఫెడరేషన్ ఏర్పాటు చేయడం జరిగింది. ఆనాడు మింటోమార్లే విచారణ సంఘానికి బ్రాహ్మణేతరులు బ్రాహ్మణులతో సమానస్థాయి వచ్చేవరకు రాజకీయ సంస్కరణలు ప్రవేశపెట్టవద్దని శెట్టిగారు విజ్ఞప్తి చేశారు. అది ఆనాటి రాజకీయ పరిస్థితి. కాని రామచంద్రా రెడ్డి గారి అనుయాయులలో ఎక్కువ మంది బ్రాహ్మణులే. వారికి బ్రాహ్మణ ద్వేషం లేదు.

1930లో శ్రీ బొల్లినేని మునుస్వామి నాయుడు గారు వుమ్మడి మద్రాసు రాష్ట్రంలో ముఖ్యమంత్రిగా వున్నపుడు శ్రీ రామచంద్రా రెడ్డి గారు మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్ అధ్యక్షులుగా ఎన్నుకోబడ్డారు. ఈ [illegible] పట్టభద్రులను తప్ప సామాన్య [illegible]

**వవ్వేరు మునసబు నుంచి ఢిల్లీ సభలో ప్రతిపక్ష నాయకత్వం వరకు ఎదిగినా రైతు సమస్యలపై మక్కువ వీడని పల్లెటూరు పెద్దరెడ్డి; రాజకీయాలు వేరైనా, అందరి మన్ననలూ పొందిన పెద్ద మనిషి!**

పదవిని రెడ్డిగారు అధిష్టించడం ఆంధ్రునికి ఆనాడు జరిగిన అపూర్వ ప్రతిష్టాత్మక గౌరవం. వారికి రాజకీయంగా గుర్తింపు తెచ్చిన పదవి కూడా అదే. రెడ్డిగారి చిత్తశుద్ధి, నిజాయితీ, స్నేహతత్పరత, మానవతా విలువలను గుర్తించింది ఈ పదవి. అన్ని రాజకీయ పార్టీలను ఒక్క త్రాటి మీద నడిపిన మహా మేధావి రెడ్డిగారు. శాసన సభ గౌరవానికి భంగం లేని విధంగా ఆ పదవికి ప్రతిష్ట చేకూర్చారు. శాసన సభాధ్యక్షులుగా వున్నపుడు చర్చలు జరిగే సమయంలో చాలా ఆసక్తిని చూపేవారు. రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో మన ఆర్థిక విధానాల మీద సంక్షోభం ఏర్పడినపుడు నిర్బంధ ధాన్య సేకరణకు వ్యతిరేకంగా భారత కిసాన్ కాంగ్రెస్ అధ్యక్షురాలైన భారతీదేవి చేస్తున్న రైతాంగ పోరాటానికి మద్దతుగా రైతులకు గిట్టుబాటు ధరలను యివ్వవలసిందిగా ఆదేశాలు యిచ్చి తన పూర్తి సహకారం అంద జేశారు. 1923, 1926, 1930 సంవత్సరాలలో అవిచ్ఛిన్నంగా వారు శాసన సభ కౌన్సిల్ సభ్యులుగా ఎన్నిక కావడం వారి నిస్వార్థ సేవకు ప్రబల దృష్టాంతం.

### వ్యవసాయ రంగం

1943లో రెడ్డిగారు మద్రాసు అగ్రికల్చరల్ అసోసియేషన్ అధ్యక్షులుగా వుండి రైతాంగానికి గణనీయమైన సేవ చేశారు. ఆనాటి వుమ్మడి మద్రాసు రాష్ట్రంలో నీటి పారుదల ప్రాజెక్టుల సాధనకు శ్రమపడ్డారు. 1952లో స్వతంత్ర్య అభ్యర్థిగా, పార్లమెంటు సభ్యులుగా ఎన్నికయినపుడు నాటి కేంద్ర ఇరిగేషన్ మంత్రి హైకుక్లా హాఫీని రప్పించి సోమశిల ప్రాంతాన్ని వారికి చూపించారు. గవర్నరు త్రివేదిని కూడా సోమశిల సందర్శింపజేశారు. కె.సి. కెనాల్ వల్ల గాని, నందికొండ కుడికాలువ వల్లగాని నెల్లూరు జిల్లాకు ప్రయోజనం లేదని, సోమశిల ప్రాజెక్టు 2 లక్షల ఎకరాలకు నీరు అందివ్వగలదని సాంకేతికపరమైన ఆలోచనా విధానాలతో ఆనాడే స్కీములను తయారు చేసి సోమశిల ప్రాజెక్టుకు అంకురార్పణా రూపమైన పథకాలు ఏర్పాటు చేశారు. దాని వల్ల ఆత్మకూరు, ఉదయగిరి, కావలి తాలూకాల వ్యవసాయానికి వుపకారం ఏర్పడగలదన్నారు. అలాగే కావలి, కనుపూరు కాలువల నిర్మాణంలో వారి ప్రమేయం వుంది. కాని పై పథకాలు వారి తరం తరువాతనే కార్య రూపం దాల్చాయి.

ఆనాటి కాంగ్రెస్ ప్రభుత్వం భూసంస్కరణలు అమలు పరచి రైతులను కూలీలుగా మార్చే దశలో రెడ్డిగారు రైతాంగానికి నాయకత్వం వహించారు. స్వతంత్ర అభ్యర్థిగా పార్లమెంటుకు ఎన్నుకోబడి, నేషనల్ డెమోక్రటిక్ ఫ్రంట్ ఏర్పాటుకు దోహదపడి, దానికి శ్యాంప్రసాద్ ముఖర్జీ నాయకులుగా, రెడ్డిగారు వుపనాయకులుగా వుండి రైతుల క్షేమాలను బలిపెట్టే పరిశ్రమల పట్ల కత్తులు దూసేవారు. గ్రామీణ ప్రజల మూగవేదనలను ప్రభుత్వానికి వినిపించేవారు. రైతు రక్షణా వుద్యమంలో ఆచార్య రంగా గారితో కలిసి ఒక దశాబ్దం సేవ చేశారు. నాటి ప్రభుత్వం రాజ్యాంగపు 17వ చట్ట సవరణ ద్వారా భూస్వామ్యములు రద్దు చేయించి, తమ బలాన్ని రైతాంగంపై ప్రయోగించిన తరుణంలో రెడ్డిగారు దేశీయ ఆందోళన సాగించారు. 1928-29 ప్రాంతంలో ఆనాటి బ్రిటీష్ ప్రభుత్వం ల్యాండ్ రెవిన్యూను 18 శాతం పెంచాలని ప్రయత్నించగా, దానిని ఎదిరిస్తూ దండునారాయణ రాజు శాసన సభా కమిటీ సభ్యులై శిస్తు హెచ్చింపు అన్యాయమని రంగా గారి రిపోర్టును సమర్థించారు. రైతుల హక్కుల కోసం పోరాడిన మహాయోధుడు రెడ్డి గారు. తరువాత వచ్చిన కాంగ్రెస్ ప్రభుత్వం హెచ్చించిన 18.75 శాతం భూమిశిస్తు ప్రతిపాదనను కూడా ఆర్థిక విచారణ సంఘ కమిటీలో ఎదిరించారు. రెడ్డిగారి వ్యవసాయ వుద్యమం కేవలం ఆంధ్ర దేశానికి పరిమితం కాలేదు. ఇటు దక్షిణ భారతం పూర్తిగా అటు ఒరిస్సా, బెంగాలు వరకు వ్యాపించింది. రైతులకు అనేక రాయితీలు కల్పించడంలో, పంటలకు గిట్టుబాటు ధరలు రాబట్టడంలో సఫలీకృతులైనారు. స్వాతంత్ర్యం

కొరవ 13 పేజీలో

# పెత్తందార్లకనుసన్నలలో మీరెన్నుకొన్న ప్రజాప్రతినిధి మసలుకోవడం గౌరవమా?

అన్నింటికంటే ముఖ్యమైనది ఆత్మాభిమానం ! దానికున్న విలువ మరిదేనికీ వుండదు ; వుండడానికీ లేదు ; మనల్నిట్లా పదిమంది గౌరవించాలని చూస్తామో, మన ప్రతినిధి కూడా గౌరవం పొందుతూ వ్యక్తిత్వంతో బ్రతకాలని మనం కోరుకోవడంలో తప్పేమీ లేదు. ఎమ్మెల్యే అంటే ప్రజా ప్రతినిధి. ప్రజల ఆశలకు ప్రజల అవసరాలకు ప్రజల ఆశయాలకు ప్రజల సమస్యలకు ప్రజల పరువు ప్రతిష్టలకు ప్రజల జీవన విధానానికి ప్రతిరూపం వంటివాడు. అటువంటి ప్రజా ప్రతినిధి కల్గిన నియోజకవర్గం

ఎమ్మెల్యేలను చూడలేదు మనం ; అందులో ఒక్కరంటే ఒక్కరు వ్యక్తిత్వంతో వ్యవహరించారా ? తమ స్వంత కాళ్ల మీద తాము నడిచారా ? తమ ఆత్మగౌరవాన్ని

## సూళ్లూరుపేట ఓటర్లు తమ ఆత్మాభిమానం కాపాడుకోవాలి !

కాపాడుకొని పదవిలో కొనసాగారా ? ప్రజల ఆత్మాభిమానాన్ని పరిరక్షించారా ?

కాటేస్తుంటే ప్రతిఘటించడం మన కర్తవ్యం కాదా ? ఆలోచించండి !

అంతే కాదు - నియోజకవర్గ అభివృద్ధి విషయంలోనూ పెంచలయ్య



సూళ్లూరుపేటలో చరిత్ర సృష్టించారు. గెల్చిన నాటినుంచి ఒక్కరోజు వృధా చేయలేదు ; ఒక్క అవకాశం వదలి పెట్టలేదు ; ఒక్క గ్రామం సమస్య విస్మరించలేదు.

చుట్టూ నీళ్లు చుట్టుముట్టి ఎటూ దారన్నది లేక పగలుకు, రాత్రికి తేడా తెలియక కారు చీకట్లో నాగరికతకు నూరు ఆమడల దూరంలో రాతియుగాన్ని తలపించే జీవనానికలవడిన పులికాట్ దీవుల్లో ఈరోజు దీపాలు వెలిగాయన్నా, రోడ్లు ఏర్పడ్డాయన్నా, మరపడవలు దీవులు చేరుతున్నా, పక్షుల పేరుతో ఆంక్షలు తొలగినా, చెక్ డ్యాములతో పొలాలకు నీరందినా అవంతా పెంచలయ్య

పిల్లలనేమి చేయాలో తెలియని పల్లెల్లో ఎన్నెన్ని స్కూళ్లు విద్యాగంధం వ్యాప్తి చేస్తున్నాయి ? మంచాల మీద మోసుకొచ్చే లోపల ప్రాణాలు అనంత వాయువుల్లో కలిసిపోతే



కుమిలిపోవడం తప్ప మరేమీ చేయలేని నిస్సహాయ గ్రామీణులకు ఎన్నెన్ని ఆస్పత్రులు చేరువకు వచ్చాయి ?

పెత్తందార్ల పోషణలో, నాయకుల అడుగులకు మడుగు లొత్తడమే తమ ఏకైక కర్తవ్యంగా భావించే ఎమ్మెల్యేలు ఇవన్నీ

# నియోజకవర్గంఅభివృద్ధిచేసేవారా - నాయకులఅడుగులకుమడుగులొత్తేవారా? ఎవరుకావాలి?

దాని ప్రజానీకం పదిమందిలో తలెత్తుకొని మనగల్గుతుంది !

పసల పెంచలయ్య గత ఐదేళ్లలో సూళ్లూరుపేట



ప్రజానీకానికి చేసిన అత్యంత ప్రధాన సేవ ఇదే ! ఒక ప్రజాప్రతినిధి ఏ లక్షణాలతో వుండాలో, ఆ లక్షణాలన్నింటినీ పుణికి పుచ్చుకొని ప్రవర్తించా రాయన.

సూళ్లూరుపేటలో ఎందరు

దురదృష్టం - ఈ ప్రశ్నలు వేటికీ సమాధానాలు సంతోషం కల్గించేవి కావు. పేర్లెందుకు చెప్పాలి ? గతంలోవున్న ఎమ్మెల్యేలు ఒక్కొక్కరి పేరు తలచుకోండి ; వారితో పెంచలయ్యను పోల్చి చూసుకోండి !

ఇప్పటి ఎన్నికల్లో పోటీకి నిల్చిన అభ్యర్థులను కూడా పరికించండి ; వారితో పెంచలయ్యను బేరీజు వేసి చూడండి!

పోరి ప్రజాస్వామ్యం తెచ్చుకున్నదే పెత్తందార్ల దౌష్ట్యం తుదముట్టించేందుకు ; కాని ప్రజాస్వామ్య ఎన్నికలలో తిరిగి

ధనం వున్నదనే నెపంతో, గెల్చే ఎమ్మెల్యే తమ కనుసన్నలలో మసలే వాడే వుండాలని, తమ చెప్పుక్రింద తేలులా పడివుండాలని, బొమ్మలాంటి అభ్యర్థిని తమముందు నిలబెట్టి ఓట్లేయించుకోవడానికి వస్తున్న పెత్తందార్లను నిలువరించడం మన ధర్మంకాదా ఆలోచించండి !

పెంచలయ్య జీవితమంతా ప్రజాసేవా తత్పరతమయం. స్కూడల్ శక్తుల విజృంభణను శక్తివంతంగా ప్రతిఘటించిన సాహసికుడు. ఎమ్మెల్యేగా తాను గౌరవంగా బ్రతకడమే కాదు - తన నియోజకవర్గం ప్రజల గౌరవమూ కాపాడాడు.

కృషి ఫలితాలే ! ఎడ్లుల బండ్లలో తప్ప వెళ్లడానికి వీలుకాని తీరగ్రామాలెన్నింటికో తారు రోడ్లు పరిచారు ; మొలలోతు నీళ్లలో తప్ప దాటలేని కాలువ లెన్నింటికో వంతెనలు కట్టారు; కటిక చీకట్లో మ్రగ్గే హరిజన వాడలు గిరిజన వాడల్లో ఈనాడు విద్యుత్ వెలుగులు విమ్ముతున్నాయి; ఎన్నివేలమంది పేదలు ఇటుకతో కట్టిన ఇళ్లల్లో వుండే భాగ్యానికి నోచుకున్నారో ; పశువుల కొట్టకు నడవల మీదకు పంపడ తప్ప

చేయగలరా?

సూళ్లూరుపేట ఇప్పటికీ సమస్యల నిలయమే. ఎన్నెన్నో గ్రామాలు ఇప్పటికీ ఎన్నెన్నో సమస్యలతో, కొరతలతో, కోరికలతో కొట్టు మిట్టాడు తున్నాయి. వాటన్నింటినీ ఒకటొకటిగానైనా పరిష్కరించు కోవలసివుంది.

అందుకు మనకు సమర్థుడైన ప్రజా ప్రతినిధి కావాలి; అతడు మన సమస్యలు అర్థం చేసుకోగల్గే వాడై వుండాలి ; వాటికోసం తన సమయం వెచ్చించ గల్గినవాడు కావాలి ; వాటి సాధనను ప్రభుత్వంలో పలుకుబడి నుపయోగించి, పోరాటం చేసేవాడై వుండాలి ; ఎవరో ఏదో అనుకొంటారని సంశయం లేకుండా, ఎవరెవరి అనుమతి కోసమో ఎదురు చూడకుండా స్వతంత్రించి నిర్ణయాలు తీసుకొనేవాడై వుండాలి

[illegible] 11 పేజీలో

రాజశేఖర్ ఆగ్రహం

# నా భార్య నాకు మేకప్ చేస్తే వీళ్లకు నష్టమేమిటి?

డాక్టర్ రాజశేఖర్‌కు మేకప్ వేసేది, కాస్ట్యూమ్స్ సమకూర్చేది ఆయన జీవిత భాగస్వామిని జీవిత. మేకప్ మ్యానేలేగాని, మేకప్ ఉమన్‌లు ఉండకూడదు అని ఆంధ్ర మేకప్‌మెన్ సంఘ సభ్యులు అభ్యంతరం చెప్పారట. "మహిళలకు సమాన స్థాయి ఉండాలని అందరూ ఘోషిస్తున్న ఈరోజుల్లో ఈ చెప్పడంటు అభ్యంతర మేమిటి? విమానాలు కూడా నడుపుతున్నారు మహిళలు. అంటు వంటప్పుడు నాకు నా భార్య మేకప్ చేస్తే వీళ్ల అబ్బ సొమ్ము ఏం పోయిందట? నా భార్య ఒకప్పుడు నటి. మేకప్ వేయడంలో శిక్షణ పొందింది. ఎల్లప్పుడూ నాతోనే ఉంటుంది. మేకప్‌తో నా ఫేస్‌ను ఎలా మౌల్డ్ చేయాలో అందరికన్నా ఆమెకే బాగా తెలుసు. ఈ విషయమై నేను కోర్టుకు వెళ్ళడానికి కూడా సిద్ధమే" అని డాక్టర్ రాజశేఖర్ అంటున్నప్పుడు ఆయన కళ్లు ఎర్రబారాయి.

*పరాకు చిత్తగించేవేళ*

**విజయశాంతి**

గోళ్ళకు పాలిష్ వేసుకున్నాక బ్రష్‌తోపాటు ఉన్న మూతను మూసేయాలను కుంటూనే ప్రతి సారి మరచిపోతుంటాను. ఒక్కోసారి ఆ సీసా పొరబాటున నా చేతికి తగిలి, పాలిష్ అంతా ఒలికి పోతుంటుంది కూడా. లేదా-మూత మూయనందువల్ల గాలికి ఆ పాలిష్ గడ్డకట్టి పోవడమూ కద్దు.

**జయసుధ**

కూలింగ్ గ్లాస్ లేనిదే అసలు ఇంట్లోంచి బయటకు కదలను. దానితో దాని కవర్‌ను కూడా తీసుకెళ్తుంటాను. కాని, ఇంటికి తిరిగొచ్చాక చూసుకుంటే, ఆ కవర్ ఉండదు. ఎక్కడో వదిలేసి వచ్చేస్తుంటాను. ఇలా ఒక్కసారా? చాలా సార్లు! ఇలా ఎందుకు జరుగుతుందో నాకు అంతుబట్టడంలేదు.

**రంభ**

ఎక్కడ ఉంచిన వస్తువు అక్కడ లేక పోతే నాకు మహా చిరాకు. ఎంతో అప్రమత్తతతో ఉన్నా - అప్పుడప్పుడు పప్పులో కాలేస్తుంటాను. ఏ విషయంలో తెలుసాండీ? ఫౌంటెన్‌పెన్ కేప్ విషయంలో. రాసేశాక కలం మూద్దామని చూస్తే కేప్ కనిపించదు. ఆ తర్వాత మరేదానికోసమైనా వెతుకుతూంటే గాని ఆ కేప్ కళ్లబడదు. ఏమిటో ఈ తమాషా?

## తల్లికి ఇష్టం లేకున్నా సుమన్ పెళ్లి ఖాయం!

ప్రముఖ రచయిత డి.వి. నరసరాజు మనుమరాలితో సుమన్ వివాహం రెండు మూడు నెలల క్రితమే జరగవలసింది. వధువు శిరీష మద్రాసు ఎతిరాజా కాలేజీలో బి.ఎ. చదువుతోంది. ఒకప్పుడు ఆ కాలేజ్ ప్రిన్సిపాల్‌గా సుమన్ తల్లి పనిచేసింది. సుమన్, శిరీష ప్రేమించుకున్నారు. సుమన్ తల్లి ఈ వివాహానికి మొదట ఆమోదించింది. కాని, ఆమె మనసు మార్చుకొని, వేరే అమ్మాయిని చూసింది. సుమన్ ఒప్పుకోలేదు. శిరీష తల్లిదండ్రులను సుమన్ వెంటనే కలుసుకుని తమ వివాహానికి వాళ్ల అంగీకారం పొందాడు. నవంబర్ 24 ఉదయం మద్రాసులోని రాజా ముత్తయ్య హాలులో - వివాహం నిశ్చయమైంది. ఆ తర్వాత హైదరాబాద్‌లో రిసెప్షన్ ఏర్పాటు చేయబడుతుంది. సుమ జైలులో ఉన్నప్పుడు అతణ్ని విముక్తుణ్ని చేయడానికి సుమన్ తల్లి అష్టకష్టాలు పడింది. ఎంతో డబ్బు ఖర్చు పెట్టింది. ఇంతలో ఆమెతో ఒకప్పుడు ప్రొఫెసర్‌గా కలిసి పనిచేసిన పి.సి. అలెగ్జాండర్ తమిళనాడు గవర్నర్‌గా నియమింపబడడంతో ఆయన్ని ఆమె కలుసుకుని, నిరపరాధి అయిన తన పుత్రుడు సుమన్‌ను విడుదల చేయించేలా చూడమంది. అలెగ్జాండర్ వెంటనే తత్సంబంధమైన ఫైల్సు తెప్పించి, పరిశీలించాడు. సుమన్ అన్యాయంగా జైలు శిక్ష

కొరవ 19 పేజీలో

## వెండితెరపై మళ్లీ మాదాల

రెడ్‌స్టార్ మాదాల రంగారావు మళ్లీ వెండితెరపై కనిపించ బోతున్నాడు. 'యజ్ఞం' సినిమా వంటి అత్యుత్తమ చిత్రం తీసిన జి. రామినీడు ఈ చిత్రానికి దర్శకుడు.

# సినిమా నటినైతే తిరుపతి వెంకన్నను దర్శించుకోకూడదా?

"పవిత్రమైన స్థలంలో కూడా అల్లరి ఏమిటండి? ఇటువంటి వారిని ఆ ఏడు కొండలవాడు క్షమిస్తాడా?" అంది ఆమని. గతవారం ఆమె తన తల్లి, తోబుట్టువులతో తిరుపతి వెళ్ళిందట ధర్మదర్శనం చేసు కుంటానని మొక్కున్నందు వల్ల వేలాది భక్తులతో పాటు మేమూ క్యూలో నిలుచున్నాం. తీరా స్వామిని సమీపించే సమయానికి దాదాపు 20 మంది కుర్రాళ్లు వచ్చి మాకు అడ్డంగా నిలుచున్నారు. నేను సినిమా తారనట. అసభ్యంగా నటిస్తానట. అందుకని నేను దేముణ్ని దర్శించకూడదట. అర్ధనగ్న దుస్తులు ధరిస్తానట. నేను సినిమా నటినైనంత మాత్రాన స్వామిని దర్శించకూడదని ఎక్కడుంది? నాపై ఆంక్ష విధించడానికి వీళ్లెవరు? అసలు గుడిలోకి ప్రవేశించిన వీరికి దేవుడిమీద భక్తి వుంటే, నా వంక దృష్టి ఎలా మరలుతుంది? బాగా అడిగేశాను. ఇంతలో దేవస్థానం వాళ్లెవరో వచ్చారు. సంగతి తెలుసుకుని, వాళ్లకూడా నన్ను దైవసన్నిధికి పంపించకుండా వచ్చిన దారినే వెళ్లిపొమ్మన్నారు. ఎంత అన్యాయం? ఈ విషయం గురించి

**ఆమని ఆవేదన**

పత్రికల్లో రావాలి, "అంటున్నప్పుడు ఆమని కంఠం గాద్గదికమైంది.

## కమల్‌హసన్ సంచలనం!

జాతి గర్వించదగ్గ నటుడు కమల్‌హసన్ తన చిత్రాలలో ఏదో ఒక ప్రత్యేకత చూపి ప్రజాభిమానం పొందుతుంటాడు. తమిళంలో ఆయన స్వయంగా నిర్మిస్తున్న 'సతిలీలావతి' చిత్రంలో హీరోయిన్‌గా హాస్యనటి కోవై సరళను బుక్ చేశారు. హాస్య ప్రధానంగా సాగే ఈ చిత్రానికి బాలుమహేంద్ర దర్శకుడు. సంగీతాన్ని ఇళయరాజా సమకూర్చుతున్నారు.

# నిజమైన ప్రజా సేవకు సజీవ చిహ్నం చూశాం —
# ప్రగతికి పరచిన బాటగా దాన్ని మల్చుకొందాం!

అదే అరచొక్కా
అదే అడ్డ పంచ
అదే జీవన శైలి
అదే సామాన్యుడి చెలిమి
ఒకటి రెండుసార్లు
ఎమ్మెల్యేగా గెల్చినా
సివి శేషారెడ్డిలో
ఏమాత్రం మార్పు లేదు!
వయస్సు పైబడేకొద్దీ
అనుభవం పెరిగేకొద్దీ
పదవులొచ్చే కొద్దీ
మరింత చురుకుగా
మరింత అంకితభావంతో
మరింత సేవాదృక్పథంతో
ప్రజల్లోకి దూసుక వెళ్లడం
పదిమందికి సాయపడడం
పేదవాడికి సేవచేయడం
బడుగు జీవిని భుజం తట్టి



సర్వేపల్లి శాసనసభ నియోజకవర్గంలో కాంగ్రెస్ అభ్యర్థిగా శ్రీ సివి శేషారెడ్డి పోటీ చేయడం చాలామంది పెద్ద పెద్ద వాళ్లకు నచ్చడం లేదు. అవును మూడోసారి కూడా నన్నే గెల్పించమని ధైర్యంగా సర్వేపల్లి ఓటర్ల ఎదుటకు రాగల్గుతున్నాడు ; గ్రామాలలో తిరగ గల్గుతున్నాడు ; ఓట్లు అడుగ గల్గుతున్నాడు.

హైదరాబాదులో వున్నా తన పూర్తి సమయాన్ని నియోజకవర్గ సమస్యలకు, కార్యకర్తలకు కేటాయిస్తాడు !

అందుకే ఆయనకు
మూడోసారి కూడా
గెల్పించమని కోరే
హక్కు వుంది!

ఈ ఐదేళ్లలో సివి శేషారెడ్డి సర్వేపల్లి నియోజక వర్గానికి చేసిన సేవ అంతా, అంతా ? ఈ ఐదేళ్లలో ఒక్కటంటే ఒక్కరోజు వృధా చేశాడా ? ఒక్కటంటే ఒక్క గ్రామం విస్మరించాడా ?

ఎంతెంత 'అభివృద్ధి
జరిగింది మన కళ్లముందు
వానవస్తే నడకకు
సాధ్యంకాని తీరప్రాంత



పక్కా ఇళ్లుగా
రూపాంతరం చెందాయి!
ఎన్ని పాఠశాలలకు
భవనాలేర్పడ్డాయి!
ఎన్ని ఆస్పత్రులకు

వుంటే శేషారెడ్డి గారికిప్పుడు ఓట్లివ్వమని అడగడానికి ఎవ్వరూ సాహసించేవారు కాదు. కాని ఎమ్మెల్యే పదవి ప్రజల సేవకోసం తప్ప, తన సుఖం కోసం కాదన్న ఆశయంతో, ఆదర్శంతో అంతగా

# సామాన్యులకింత చేరువైన ప్రజాప్రతినిధి ఇంకెవరున్నారు?

సలకరించడం తప్ప
శేషారెడ్డిలో
అణువంత మార్పులేదు.

అందుకే ఆయన

ఎందుకు నచ్చుతుంది -
శేషారెడ్డి వారివలె
బంగళాల్లో బ్రతకడు

బురద డొంకలిప్పుడు
తారు రోడ్లుగా మారాయి!
వినుకు రాలితే

స్వంత ఇళ్లు సమకూరాయి!
ఎన్నెన్ని గ్రామాలకు
రక్షిత నీటిపథకాలు

తాపత్రయ పడబట్టి ఈరోజు శేషారెడ్డిని మళ్లీ గెల్పించుకోవడం మన కర్తవ్యం; మన శ్రేయస్సుకు అది అవసరం.

**సర్వేపల్లి నియోజకవర్గంలో తాను చేసిన అభివృద్ధే సి.వి.శేషారెడ్డికి శ్రీరామరక్ష**

ప్రజాసేవకు
సజీవ చిహ్నం
సివి శేషారెడ్డి;
ఆయన కృషిని
మన నియోజకవర్గం
ప్రగతికి మార్గం



కొట్లాడించలేదు
పేదవాడు వాకిటకు వస్తే
పురుగువలె విదిలించడు
మధ్య తరగతి రైతు
పనిబడి వస్తే
ఫోజులు కొట్టడు
పొడుగు పొడుగు కార్లలో
షికార్లు తిరగలేడు
ఫారెన్ సెంట్లు పూసి
ఘుమఘుమలాడడు.

ఇంటికి వచ్చిన వార్ని ఆప్యాయంగా పలుకరిస్తాడు ; అర్ధరాత్రి అయినా నేరుగా లోపలకు వచ్చి "నా పనిచేసి పెడతావా లేదా" అని దబాయించగల్గే చనువు ఇస్తాడు; రాత్రీ పగలు తేడా లేకుండా ప్రజా సేవలో నిమగ్నమౌతాడు; నెల్లూరులో వున్నా,



మంచినీళ్లు —
సరఫరా చేస్తున్నాయి!
మంత్రులను
ప్రాధేయపడి
అధికారులతో
పోరాటం చేసి
కాగితాల కట్టలు
పట్టుకొని ప్రతి
ఆఫీసూ తిరిగి
ఎన్నెన్ని పథకాలు
మంజూరు తెచ్చారు!
ఎందరు పేదలకు
ఉపాధి చూపారు !

అందరు ఎమ్మెల్యేల వలె ఎన్నికల తర్వాత ఖుషీగా, జల్సాగా హైదరాబాదులోనే, ఏదోక చోటనే తిరిగివుంటే ; స్వంత వ్యాపారాల అభివృద్ధికి తన పలుకుబడి ఉపయోగించుకొని



పరచే సాధనంగా
మల్చుకొందాం;
ఓట్లు వేద్దాం ;
మళ్లీ గెల్పించుకొందాం!

## జనవాణి

3వ పేజీ కొరవ

సక్రమంగా రూల్స్ పాటించడంలేదు. దీనివల్ల బస్సులలో ప్రయాణించే ప్రయాణీకులతోపాటు రోడ్డు మీద వెళ్లే వాహన చోదకులు ఇబ్బంది ఎదుర్కొంటున్నారు. బస్సులు స్టాపింగులలో కాక ఎక్కడంటే అక్కడ ఆపి ప్రయాణీకులను ఎక్కించుకోవడంవల్ల టౌన్‌లో తరచూ ట్రాఫిక్ నిలబడి పోతున్నది. ఆటోలు, స్కూటర్లు, సైకిళ్ల పై వెళ్ళే వారి పాలిట యమపాశాలవు తున్నాయి ఈ టౌన్‌బస్సులు! వీటిని నిర్ణీత ప్రదేశాల్లో నిలిపేలా ట్రాఫిక్ పోలీసులు, ఆర్టీవో తగిన చర్యలు తీసుకొంటే గాని టౌన్‌బస్సుల స్పీడ్‌కు బ్రేకులు వేయలేరు.

నెల్లూరు -డి.వెంకురెడ్డి.

### రైల్వేబ్రిడ్జికి రేకులు వేయాలి

సౌత్‌స్టేషన్ అండర్‌బ్రిడ్జికి క్రిందివైపున రేకులు గాని స్లాబ్‌గాని లేదు. ట్రైను పోతున్నప్పుడు దాంట్లోని మల మూత్రాదులు క్రింద పోయే జనాలపై పడి పావనమౌతున్నారు. కార్లు, రిక్షాల కైతే టాపులు వుంటాయి. నడిచి పోయే వారు, స్కూటరిస్టులు పడరాని పాట్లు పడుతున్నారు. గూడ్సు బండ్లు పోయేటప్పుడు కూడా బొగ్గు, ఆయిల్‌ట్యాంకర్ల ఆయిల్ అందరి నెత్తి పైనా పడుతున్నది. మొన్న ఒక రోజు ఆ దారిన వెళ్ళే స్కూల్ పిల్లలపైన ఆయిల్ పడి బట్టలన్నీ ఖరాబయ్యాయి. రైల్వే శాఖ వారు ఈ విషయమై స్పందించి తగిన చర్య తీసుకోవాలని మనవి.

నెల్లూరు -కె.విజయకుమార్‌రెడ్డి,
బి.మంజూనాథ్ సింగ్.

### ఉపద్రవాల నుంచి శాశ్వత రక్షణ కల్పించాలి!

కోస్తా జిల్లాల్లో గత రెండు వారాలుగా కురిసిన వర్షాలు జన జీవనాన్ని కకావికలం చేశాయి. వాయుగుండాలతో బంగాళాఖాతం హోరెత్తి పోయింది. తుఫానులవల్ల కురిసిన వర్షాలకు వాగులు పొంగి, చెరువులకు గండ్లుపడి ఊళ్లు జలదిగ్బంధనానికి గురై, జన ధన నష్టం అపారంగా సంభవించింది. వేలాది ఎకరాల పంట నీట మునిగిపోయింది. పండ్ల తోటలు, రొయ్యల చెరువులు, కోతకు వచ్చిన వరిపంట, చేనేత కార్మికుల మగ్గాలు తడిసి దెబ్బతిన్నాయి. వర్షాలకు 225 మంది, గూడూరు వద్ద బస్సు మునక ప్రమాదంలో 39మంది ప్రయాణీకులు మరణించడం హృదయ విదారకమైన అంశం. శాస్త్రజ్ఞులు సముద్రంలో ఏర్పడబోతున్న వాయుగుండాల గురించి ముందుగానే హెచ్చరించ గలుగుతున్నా భారీ వర్షాలనుంచి అమూల్యమైన ప్రాణాలు దక్కించుకోలేక పోతున్నాం. పల్లపు ప్రాంతాలు జలమయం కావడం, లక్షలాది కుటుంబాలు నిరాశ్రయులు కావడం వంటి విషాద దృశ్యానికి తెర పడడం లేదు. తరచూ ముంపుకు వరదబీభత్సానికి గురయ్యే ప్రాంతాలను గుర్తించి కట్టుదిట్టమైన రక్షణ చర్యలు తీసుకోవాలి. పేదలకు పక్కా ఇండ్ల నిర్మాణ కార్యక్రమాన్ని విస్తృతంగా చేపట్టాలని మనవి.

నెల్లూరు -కె.వి.ప్రసూన.

### సోషలిస్ట్ ఆర్థిక విధానం అమలు పరచాలి!

నేటి సమాజంలో నేరాలకు, నైతిక పతనానికీ చాలా వరకు మూల కారణం మన ఆర్థిక విధానమే. ఈ ఆర్థిక విధానంలో భాగ్యవంతులు మరీ భాగ్యవంతులౌతుంటే, మధ్యతరగతి ప్రజలు కనీస అవసరాలు తీరక కృంగిపోతున్నారు. తీరని కోరికలతో కలవారిపై ద్వేషాలు పెంచుకుని కొన్నిచోట్ల నేరస్తులుగా మారుతున్నారు. ఇది ఒక విషవలయంగా మారివుంది. దీనికి విరుగుడు సరైన ఆర్థిక విధానమే. జయప్రకాశ్ నారాయణ, నెహ్రూలు ఆశించిన సోషలిస్ట్ ఆర్థిక విధానాన్ని ధైర్యంగా, నిజాయితీగా అమలు పరిచినట్లైతే ప్రతి ఒక్కరికీ ఉద్యోగ అవకాశాలు కలుగుతాయి. కుల, మత ద్వేషాలుండవు. ప్రతి ఒక్కరికీ ఉచిత, ప్రాథమిక, ఉన్నత విద్యావకాశాలు కలుగుతాయి. సొంత తెలివితేటలతో అభివృద్ధి చెందవచ్చు దీనివల్ల నైతిక మార్పులు తప్పనిసరి. సంఘీభావం స్నేహము, పరస్పర గౌరవమూ పెరుగుతాయి. కాబట్టి ప్రజలు ఈ స్ఫూర్తితో అధికారంలోవున్న ప్రభుత్వంపై తగిన వత్తిడి తెచ్చి సోషలిస్ట్ ఆర్థిక విధానాన్ని అమలుపరిచేటట్లు దీక్షతో పోరాటం సాగించాలి.

నెల్లూరు -ఎ. శోభాహరిప్రసాద్.

### కపిల్‌కు సాటిరారు

భారతీయ క్రికెట్‌లో మణిపూసైన కపిల్‌దేవ్ రిటైర్మెంట్ క్రీడాభిమానులను కృంగదీసింది. ప్రపంచంలోనే అత్యధిక వికెట్లు సాధించి చరిత్ర పుటల్లోకి ఎక్కిన కపిల్‌ను గురించి ఎంత చెప్పినా తక్కువే అవుతుంది. జాతీయ జట్టు ఆపద సమయాల్లో చిక్కినప్పుడు తనదైన ధోరణిలో ఆడి ఒడ్డున పడేసిన క్షణాలను క్రీడాభిమానులు మరవలేరు. 83లో ప్రపంచ కప్‌లో అనామక జట్టును విజయ పంథాన నడిపిన ఘనత కపిల్‌కు దక్కింది. భవిష్యత్‌లో భారత్‌కి కపిల్ వంటి బౌలర్, కపిల్ వంటి బ్యాట్స్‌మెన్ లభించే అవకాశం వుందేమోగానీ కపిల్ వంటి ఆల్‌రౌండర్ లభించడం దాదాపు అసాధ్యమే. కపిల్ రిటైర్మెంట్ భారత్ క్రికెట్ జట్టుకి క్రీడాభిమానులకు మ్రింగుడు పడని విషయం. సరియైన సమయంలో హుందాగా రిటైర్మెంట్ ప్రకటించి 'దటీజ్ కపిల్' అని చాటుకున్నారు.

నెల్లూరు -కె.వి.కిరణ్‌కుమార్.

## సినిమా

17వ పేజీ కొరవ

అనుభవిస్తున్నాడని గుర్తించి, పోలీసు అధికారులను మందలించి, నిమిషాల మీద సుమన్ విడుదలయ్యేలా చూశాడు. నేడు ఆ తల్లి మాట కాదని ఆ తల్లి అభీష్టానికి విరుద్ధంగా శిరీషను వివాహం చేసుకోవడ మేమిటని అనుకుంటున్న వారు లేకపోలేదు. కాని, సుమన్ తను మనసిచ్చిన అమ్మాయినే వివాహం చేసుకుంటున్నాడు. శుభం !

### హిందీ చిత్రాలు 'నో'

"ఇటుపైన హిందీ చిత్రాలు ఒప్పుకోవడంలేదు," అన్నారు మమ్ముట్టి. ఆయన తొలి హిందీ చిత్రం "ధర్తీపుత్రా" ఫ్లాప్ అయింది గనుక. నేను హీరోగా చిత్రాన్ని ప్రారంభించారు. ఇష్టమొచ్చినట్లు కథను మార్చేసరికి చాలా మంది తారలు దూరారు. దానితో నాది గెస్ట్‌రోల్ అయిపోయింది. అంచేత, ఇటుపైన ఏ హిందీ చిత్రంలోనైనా నన్ను నటించమని ఎవరైనా అడిగితే, వెంటనే తలను అడ్డంగా తిప్పేస్తాను అన్నారు మమ్ముట్టి నవ్వేం పిలుస్తూ. ఈయన సిగరెట్, బీడీ అలవాటును మానుకోవడానికి ముక్కుపొడి అలవాటు చేసుకున్నారు. ఇప్పుడీ అలవాటును ఎలా మానుకోవడమా అని బుర్ర వేడెక్కించు కుంటున్నారు.

### మహేశ్వరి బాధ

శ్రీదేవి పిన్ని కూతురు మహేశ్వరి ఇటీవలే ఒక తెలుగు చిత్రంలో బుక్ అయింది. అంతకు ముందు ఈమె ఒక తమిళ చిత్రం షూటింగ్‌కు తిరునల్వేలి దగ్గర ఏదో ఊరికి వెళ్లిందట. "ఒక ఇంట్లోని ముగ్గురు కూతుళ్ళనూ ఒకేసారి విషం పెట్టి చంపేశారు- ఆ శవాలను చూసేసరికి నాగుండె కలుక్కుమంది. కాని, అక్కడి వాళ్ళేమో ఆ వార్తను సర్వసాధారణంగా చెప్పుకుంటున్నారు. ఆ ప్రాంతాల్లో ఇటువంటి దుర్ఘటనలు మామూలేనట. ఆ తల్లి దండ్రులు కసాయివాళ్ళకన్నా నీచులు. ఆడ పిల్లలకు పెళ్ళి ఖర్చులు, కట్న కానుకలు చెల్లించలేక ఇటువంటి అఘాయిత్యం చేస్తారట. ఇంకా అత్తవారింట్లో పడే కష్టాలూ అవీ చూడడం కన్నా పసికందుగా ఉన్నప్పుడే చంపేస్తే ఒక్కసారి ఏడ్చేసి ఊరుకోవచ్చని అక్కడివాళ్ళ తీరు అట. ఇటువంటి ఆటవిక ప్రదేశంలో డైరెక్టర్ భారతీరాజా షూటింగ్ పెట్టుకున్నారేమిటా అనిపించింది." అని మహేశ్వరి అంటున్నప్పుడు ఆమె గొంతు బొంగురు పోయింది.

## 50 ఏళ్ళ క్రితం

రున్నారు. సాంక్రామిక వ్యాధులను పలుప్రాంతాలకు యెగుమతిచేసే బస్తీహోటళ్లగతి మహాఘోరంగా వుంది. కప్పులు, ప్లేట్లు, లోటాలు, స్పూనులు, దినానికి పదివేలమంది నోళ్లకు యెగ్రాకుతున్నవి. వాటిని మురికి నీళ్లలోముంచి లేవనెత్తున్నారేగాని దినానికి ఒక మారైనా మరగబెడుతున్నారా? లేదు; ముమ్మాటికి లేదు. వీటివల్ల అంటువ్యాధులు ప్రబలడానికి ఆస్కారం. హెల్తు శిబ్బంది హోటళ్లలో దూరి బాగా మెక్కి గుఱ్ఱున పోవడమేగాని దుర్గంధభూయిష్ఠమైన హోటళ్లవంక కన్నెత్తయినా చూస్తున్నారా? దక్షిణాదిన కాఫిహోటళ్లలోగూడా కప్పు నోటికి తగలనివ్వరు. అందుకనే అక్కడవారు యింటినుండి కప్పులు తెచ్చుకుంటారు. ఉత్తర హిందూ స్థానములో చలివేంద్రాల్లో నీళ్లిచ్చినా ఒకరుత్రాగిన మట్టిపాత్రను మరొకరు ముట్టుకోరు. దాన్ని పగులగొట్టవలసిందే. అందువల్ల అంటువ్యాధులు ఒకరినుండి ఒకరికి ప్రాకవు. మనప్రాంతాన్నే? అటు దక్షిణదేశ ఆచారంగానీ; ఇటు ఉత్తరదేశ ఆచారంగాని లేదు. అనాచారం మాత్రం కావలిసినంత, ఇంత చండాలంగావుంటే మనమెట్లా నాగరికులమో యోచించండి. కమీషనరుగారు హెల్తుశాఖమీద కొంచెం నవారి చేయకపోతే వీలులేదు సుమండి;

• • •

## ప్రజాస్వామ్యానికి ఓదార్పు!

-చిన్ని నారాయణరావు

ఎంతగా మారిపోయింది
కాలం!
ఎలక్షణం ప్రారంభం పునాదిగా
పరుగెత్తేకాలం...
రాజకీయుల చేజారిపోయింది!

ఎటుచూసినా స్తబ్దత
ఏమీ చేయలేని చేవలేని
భయోద్విగ్నత
బరిలో ఘీంకరించే ఏనుగులుసైతం
గోడమీద పిల్లులై
ఖరాబుచేసే షరాబులంతా
గోడరాతల్ని మానుకొని
నుదుటి రాతల్ని నమ్ముకునే
అసహాయ అంధకారం!

ఓటరుమారాజా ఓనెలరోజులైనా
చుక్కల్లో చంద్రుడై వెలిగే
విలక్షణం
ఇదినిజంగా వి"శేషణం"!

అరచే మైకుల మ్రోతలు
హోరెత్తించే ప్రకటనల పర్వాలు
నామినేషన్ల ఆరంభం నాడే
కార్ల బారుల్ని చీరల్లా
కప్పుకునే రోడ్లు...
కనిపించవేం ఆ దృశ్యాలు?

వాహనాల పటాటోపాల్తో
గర్జించే, గాండ్రించే
ఊరేగింపులు కనిపించని
ఈ వైచిత్రం!

కటౌట్లతో, కాకాసురులతో
దొంగిలించే విద్యుచ్ఛక్తి
వెల్లువెత్తె వెలుగులేని
ఈపేలవం!!

ఎపుడైనా కన్నామా
ఎచటైనా విన్నామా...
నాలుగు దశాబ్దాల
స్వాతంత్ర్య చరిత్రలో...
నిశ్శబ్ద ప్రకంపనాల మధ్యజరిగే
ఈ ప్రజాతీర్పు
అనూహ్యమైన ఈ మార్పు
ప్రజాస్వామ్యానికి ఓదార్పు!!!

ఇన్నేళ్ల తర్వాత
తొలిపొద్దు ఉషస్సు నేడే
ఓటుకు పట్టాభిషేకం ఈనాడే
శేష(న్) కాలంలో ఎగిరేవెన్నెల
విరబూయాలి
ప్రతి ఓటరు ఇంట
వేకువ వెలుగులు విరియాలి!



### కావలి సబార్డినేటు జడ్జి కోర్టులో

O.P.7/93

బొర్రు వరలక్ష్మమ్మ పురఫ వరమ్మ-పిటిషనరు

Vs

బొర్రు సుందరరామిరెడ్డి -రెస్పాండెంటు
S/o. శివరామిరెడ్డి, కలిగిరి, నెల్లూరు జిల్లా.

### రెస్పాండెంటుకు నోటీసు

పిటిషనరు విడాకులు కోరుచూ పై పిటిషన్ దాఖలు చేసి యున్నందున నీకు ఆక్షేపణలున్న యెడల 7-12-94 తేది పగలు 10.00గంటలకు పై కోర్టులో హాజరై తెలుపుకోవలెను. లేని యెడల యక్షపార్టీగా తీర్మానించబడును.

-యం.కె.శింగరాజు,
పిటిషనరు తరఫు అడ్వొకేటు



## వుచ్చి వసంత్‌కుమార్

### అష్టమ వర్ధంతి

నీవు మాకు దూరమై పరమాత్మను చేరి అప్పుడే ఎనిమిదేండ్లు గడిచింది. నీ ఆత్మకు శాంతిని కోరుతూ నీ మధుర స్మృతులను మరువలేని

వుచ్చి వెంకటశేషయ్య - తండ్రి
వుచ్చి రుక్మిణమ్మ - తల్లి
వుచ్చి విజయకుమార్ - సోదరుడు
రామమూర్తి నగర్ - నెల్లూరు.

జననం : 7-6-1965
మరణం : 16-11-1986

# నిరాడంబరుడైన నిరుపేద ప్రజా సేవకుడు

# కోటీశ్వరులకుట్రకుహతంకావడంసహిస్తామా?



ధనవంతుల దౌర్జన్యాలు
బలవంతుల పన్నాగాలు
ఇంకానా, ఇక సాగవు !
కోటీశ్వరుల కుత్సితాలు
సంపన్నుల విధ్వంసాలు
ఇంకానా, ఇక చెల్లవు !!
పెత్తందార్ల దురహంకారం
ఫ్యూడల్ శక్తుల పోకిరితనం
ఇంకానా, ఇక సహించం !
నిజాయితీకి సమాధి,
నీతికి లోతైన గోరీ,

నిరాడంబరతకు స్వస్తి,
సత్ప్రవర్తనకు కత్తిపోటు,
నిరుపేదకు వెన్నుపోటు,
నిజమైన సేవకు విద్రోహం
చేయాలనే దుష్ట తలంపులు
సహించాలా మనం ?
సాగనివ్వాలా జనం ?

రండి,
కదలిరండి,
కదనరంగాన దుమకండి,
ఓటు కత్తి చేత పట్టండి,
బ్యాలట్ బాణం
వేయాలండి,
రాజులు, రారాజులమని
విర్రవీగేవారి
బూజు దులపండి !

***

## ఫ్యూడల్ శక్తుల కుత్సితం గ్రహించలేని వారా గూడూరు ఓటర్లు?

పత్రా ప్రకాశరావు ఎంత మంచివాడు ? ఎంతటి సత్ప్రవర్తనుడు ? ఎంతటి నిజాయితీపరుడు? ఎటువంటి నిరాడంబరుడు ? రెండుసార్లు ఎమ్మెల్యేగా గెలిస్తే ఆయన జీవన విధానంలో మార్పు వచ్చిందా? ఇసుమంత గర్వం పొడసూపిందా ? పదవులెన్ని వచ్చినా ప్రజలను వీడి వెళ్లాడా ? ప్రజలకు దూరమయ్యాడా ? నిరు పేదరికం నుంచి బయటపడ్డాడా?

ఎందుకంత కక్ష
ఆ సామాన్యుడిపై ?
ఎందుకా బ్రహ్మాస్త్రం
ఆ చిరుపిచ్చుకపై ?
ఎందుకా ఆగ్రహం
ఆ అమాయకుడిపై ?
ఎందుకా రుసరుసలు
ఆ ప్రజా సేవకుడిపై ?
ఎందరెందరు
బడాబడా పెద్దలు
కోట్లకు ఈశ్వరులు
ఎందరెందరు
పెద్దపెద్ద వాళ్లు
పెత్తందారులు
విరుచుక పడ్తున్నారు
డబ్బు వెదజల్లుతున్నారు



కుట్రలు పన్నుతున్నారు
పథకాలు రచిస్తున్నారు
ప్రకాశరావు
సామాన్యుడనా
ఈ చులకన ?
సచ్ఛీలుడనా
ఈ వెలగాటం ?
అండలేని వాడనా
ఈ హేళన పర్వం ?
జనంతో కలిసివున్నాడనా
ఈ దౌర్జన్యం ?
ప్రకాశరావు
వంటరివాడు కాదు :
మనమంతా వున్నాం
ఆయన వెనుక !
గడ్డిపోచలు పేని
గజరాజాన్ని కట్టిపడేసే
ఐక్యతవుంది మనలో !
సాహసం వుంది మనలో !
ఎదిరిద్దాం రండి ;
పోరాడదాం రండి -
అండ నిలుస్తాం రండి -
సామాన్యులపై
ధనస్వాముల
దౌర్జన్యాలు
ఎల్లకాలం
సాగవని
చాటిచెబ్దాం
కదలిరండి !



గూడూరు శాసనసభా నియోజకవర్గంలో కాంగ్రెస్ అభ్యర్థి శ్రీ పత్రా ప్రకాశరావును ఓడించాలనే దుస్సంకల్పంతో ఎటువంటి ఫ్యూడల్ శక్తులు ఏకమౌతున్నదీ అందరికీ తెలుసు. ఈ దౌర్జన్యాల నుంచి ప్రకాశరావును కాపాడుకొనడం ప్రతి ఓటరు కర్తవ్యం. పెత్తందారీ పోకడలు కల్గినవారు తమ ధనబలంతో తమకు నచ్చని వారిని అణచివేసే కుట్ర పన్నడం సహజం. ఆ కుట్రలను, ఆ పన్నాగాలను మొగ్గలోనే త్రుంచి వేయకపోతే గ్రామాలు మరొకసారి రాజులకాలంనాటి రాక్షస పాలనవైపుకు నెట్టివేయబడ్తాయి. మళ్లీ మరొకరిపైన తమ ధనబలాన్ని ప్రయోగించకుండా ఇటువంటి శక్తులకు గట్టి గుణపాఠం చెప్పగల్గితేనే రాజకీయాలలో సామాన్యుడు బ్రతికి బట్ట కట్టగల్గుతాడు.



ప్రకాశరావు కాంగ్రెస్ అభ్యర్థి. కాంగ్రెస్ పేదల పార్టీ ; రైతుల పార్టీ ; అభివృద్ధి లక్ష్యంగా కలిగిన పార్టీ ; దేశానికి సుస్థిరత చేకూర్చే పార్టీ ; ఆర్థిక వ్యవస్థకు సౌభాగ్యం సంతరించి పెట్టే పార్టీ. కాంగ్రెస్‌ను గెల్పించుకొంటేనే దేశానికి మేలు. [illegible]

[illegible]

## ఉత్తర క్రియలు



దొడ్ల సుబ్బరామిరెడ్డి
జననం: 15.08.1905
మరణం: 11.11.1994

మమతానురాగాలు మూర్తీభవించిన నెల్లూరు జిల్లా స్వాతంత్ర్య సమర యోధుల సంఘాధ్యక్షులు, నా భర్తగారైన

**దొడ్ల సుబ్బరామిరెడ్డి గారు**

తే 11.11.94 దీ శుక్రవారం స్వర్గస్తులైనారు. వారి ఆత్మకు శాంతి ప్రసాదించమని భగవంతుని ప్రార్థిస్తున్నాను.

పెద్ద కర్మ
**23.11.1994 (బుధవారం)**
రంగనాయకులపేటలోని మా స్వగృహమున జరుగును.

ఇట్లు ... శ్రీమతి సుబ్బమ్మ

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press, OFFSET Printing at Nayagara Paper Products (India) Ltd.